NAVASAKTI Telugu Weekly. Regd. No. M. 3824

# నవశక్తి

కార్మిక కర్షకులారా! ఏకము గండు!!

...లు చందా 3_0_0 ప్రచురణ: ప్రతి బుధవారము సంపాదకుడు. మద్దూరి అన్నపూర్ణయ్య

...ుటం 1 1-...-38 రాజమండ్రి సంచిక 21



స్పైన్ సందర్శింప బోవుచున్న జవహర్ లాల్ నెహ్రూ

అణా

# రైతులోకం

రామదుర్గలో సత్యాగ్రహం—మోర్వీలో అప్పుల రద్దు—సింధు హైదరాబాదులో పన్నుల నిరాకరణం—అస్సాం రైతులపై కేసులు—ఆంధ్రదేశంలో వివిధ రైతు సంఘాలు.

## ఇతర రాష్ట్రాలలో

### రైతుల సమ్మె

అండసముద్ర సమీపాన బ్రహ్మదేశము అనే గ్రామంలో కౌలుదార్లు తమ మగతాలను భూస్వాములు తగ్గించనందున ఒక నెలరోజులనుండి సమ్మెచేస్తున్నారు. పొలంలో పనేమీ కావడంలేదు.

★

### ఋణనివారణ చట్టం

పుదుక్కోటలో రైతుల ఋణాల తగ్గించడానికి ఒక బిల్లు తెస్తున్నారు. అది దర్బారు (1921 సంవత్సరం) మొదలుకొని వడ్డీరేట్ల నిర్ణయిస్తుంది. అంతకన్న ఎక్కువ వడ్డీఉండ కూడదు. ఇది వరకు ఎక్కువ కట్టి ఉంటే ఆ మొత్తం అసలు క్రింద జమకట్టవచ్చు.

★

### ఒరిస్సా ఎస్టేటు ల్యాండు ఆక్టు

ఒరిస్సా కాంగ్రెసు కమిటీ సమావేశమై ఒరిస్సా ఎస్టేటు లాండ్ ఆక్టు వైస్రాయి సంతకానికి పంపనందులకు గవర్నరు చర్యను ఖండించింది. విశ్వనాథదాసుగారు కూడ మాట్లాడుచూ గవర్నర్ చర్యను నిరసించాడు. ఒరిస్సా కౌలుదార్ల చట్టాన్ని వెంటనే అంగీకరించాలని తీర్మానించారు. ఈ చట్టం వలన ఒరిస్సాలోని జమీన్ రైతులు రైత్వారీ రైతులెంత పన్ను కడుతున్నారో అంతే జమీందార్లకు ఇవ్వవలసి ఉంటుంది.

★

### కొంకన్ రైతుల బెదరింపు

అంబేదకర్ పార్టీయగు ఇండిపెండెంటు లేబర్‌పార్టీ నాయకత్వం క్రింద బొంబాయిలోని కొంకన్‌రైతులు రత్నగిరి జిల్లాలో ఖోటే (జమీందారీ) విధానం పోవాలని తీవ్రంగా ఆందోళన సాగించుతున్నారు. జిల్లా జనాభా 13 లక్షలు. ఇందులో దాదాపు 6 నుండి 10 లక్షల దాకా ఈ ఖోటేల క్రింద నల్గి చస్తున్నారు. సభలకు రైతులు వేలకొలది వస్తున్నారు.

అంబేద్కర్ తన ఉపన్యాసాలలో తన బిల్లును ప్రభుత్వం త్రోసిపుచ్చితే పన్నుల నిరాకరణం అరంభించి జైలుకు పోతానని చెప్పాడు. రైతులు పన్నుల నిరాకరణానికి, జైలుకు సంసిద్ధమగుతున్నారు. అచ్చటచ్చట అరస్టుకు తయారయ్యేవారి లిస్టులను తయారు చేస్తున్నారు.

కాంగ్రెస్ వారు రైతుల కష్టాల గుర్తించి వారి మధ్య పొరబడక పోతే నాయకత్వం అంబేద్కర్‌వంటి వారి చేతిలో పడటంలో ఆశ్చర్యంలేదు.

### యు. పి. రైతు మహాసభ

సంయుక్త ప్రాంత రైతు మహాసభ జూన్ 12, 13 వ తేదీలలో కాన్పూరు జిల్లాలో ఉద్రిపూరా అనే గ్రామంలో జరుగుతుంది. కాంగ్రెసు సోషలిస్టు ప్రముఖులగు ఆచార్య నరేంద్రదేవ్‌గారు అధ్యక్షత వహిస్తారు.

★

### కాంగ్రెసు-రైతులు

కాంగ్రెసుకు, రైతులకు గల సంబంధాన్ని గూర్చి సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఒక ప్రకటన గావించింది. దానిలోని ముఖ్యవిషయాలు (1) రైతు సంఘాల యెడల కాంగ్రెసు వైఖరి హరిపుర తీర్మానంపై ఆధారపడి వుండాలి. (2) రైతుల క్షేమాన్నే కాంగ్రెసువారు ప్రధానంగా చూడాలి. (3) కాంగ్రెసు వారు రైతు సంఘాలలో లేకపోతే వ్యతిరేకులు ఆక్రమించుకుంటారు. (4) కిసాన్ సభలు కాంగ్రెసుతో కలిసి పనిచేయాలి. (5) మ్యునిసిపాలిటీలలోను, స్థానిక సంస్థలలోను, కాంగ్రెసుకు పోటీగా రైతు సంఘాలు తమ అభ్యర్థులను నిలబెట్ట కూడదు.

★

### రామదుర్గలో సత్యాగ్రహం.

రామదుర్గ సంస్థానంలో పన్నుల నిరాకరణ సత్యాగ్రహం ఇంకా సాగుతూనేఉంది. ప్రభుత్వం, ఎక్కడా మీటింగులు ఊరేగింపులు జరపగూడదని శాసించింది. రైతులు ఆగ్రహావేశులై సంస్థానమందంతటా ప్రభుత్వాజ్ఞను ఉల్లంఘించుతూ వరుసగా 3 దినాలు సభలు ఊరేగింపులు జరిపారు. అప్పుడేమీ అరెస్టులు జరగలేదు. కాని సోర్వాబాన్ అనే గ్రామంలోమాత్రం ముగ్గురు రైతు నాయకులను అరెస్టుచేశారు. కావాలిస్తే జైలుమీద విడుదలచేస్తామని మేజిస్ట్రేటు అన్నాడు కాని వారు నిరాకరించారు.

★

### రైతులపై కేసులు.

అస్సాంలో జమీందార్లకు రైతులు మగతా ఇవ్వమని సుమారు 100 గ్రామాల్లో నిరాకరించారు. ఇప్పటికి 175 కేసులు కోర్టులలో దాఖలు చేయబడినాయి.

★

### మోర్వీ సంస్థానంలో అప్పుల నిర్మూలనం.

మోర్వీసంస్థానం రైతుల అప్పుల నిర్మూలించడానికి ఒక స్కీము తయారు చేసింది. దీనికిపూర్వం సంస్థానంలోని రైతుల అప్పులనుగురించి విచారణ సల్పింది, మొత్తం సంస్థానంలో 14 లక్షల రూపాయలు రైతులకప్పు ఉంది. ఆ అప్పులబాధ తగ్గించడమే ఈ స్కీము ఉద్దేశ్యం. ఆస్కీములోని ముఖ్య విషయాలివి.

(1) అప్పులమీద వడ్డీ నూటికి సంవత్సరానికి 6 రూపాయలకంటె మించరాదు. (2) ఏ పరిస్థితులలోనూ వడ్డీ అసలును మించకూడదు. (3) ఎవరైనా కట్టవలసిన బాకీ అతని భూమి శిస్తుకు 5 రెట్లు మించి యుండరాదు. (ఈ సంస్థానంలో భూమి శిస్తు రు 2-15-6 మాత్రమే) (4) ఇవ్వవలసిన అప్పులను నిర్ణయించడానికి ఒక కమిటీని వేస్తారు. ఆబాకీలను మోర్వీ రైతుబ్యాంకి తీర్చివేస్తుంది. ఈవిధంగా బాకీదారునికి అప్పుతీర్మానం నిమిత్తం ఇచ్చిన సొమ్ముకు బ్యాంకు వడ్డీ పుచ్చుకోదు. ఇలా చేయడంవల్ల బ్యాంకు నష్టపడకుండా, ప్రభుత్వం బాధ్యత వహిస్తుంది.

★

### జమీందార్ల దౌర్జన్యం.

అల్లాహాబాదు జిల్లాలోని రోహీగ్రామంలోని రైతులు ఒక రైతుసభ జరిపారు. దానిలో 'హరి' 'బేగార్' అను నిర్బంధపు చాకీరికి ఎవరూ లోబడరాదని తీర్మానించు కొన్నారు.

ఒక ముస్లిం జమీందారు బేగార్‌ను, కవులు చెల్లించమని అడిగాడు. 'బేగార్' కు ఒప్పుకోనని, మగతా చెల్లించడానికి అవకాశం ఇయ్యమని రైతు అడిగాడు. ఆరైతును పట్టుకకొట్టారు. ఇది అనుచితమని తెల్పిన రైతులను కూడా బాదారు. ఇంతలో రైతులు గుమికూడి కొట్లాటకు సంసిద్ధమయారు. కాని అలాంటిదేమీ జరగలేదు. పోలీసులు కలగజేసికొని తగాదా లేకుండ జేయడానికి ప్రయత్నిస్తున్నారు.

★

### నాగపట్నం రైతుసభ

నాగపట్నం తాలూకా రైతు మహాసభ కామ్రేడ్ బి. శ్రీనివాసరావు (మద్రాసు సోషలిస్టు ప్రముఖులు) అధ్యక్షత క్రింద జరిగింది.

★

### జమీందారీ విచారణ సంఘ నివేదిక

మద్రాసు జమీందారీ విచారణ సంఘ నివేదిక బహుశా జూన్ నెలాఖరున రావచ్చు.

★

### పన్నుల నిరాకరణం

హైదరాబాదు జిల్లా టాండో డివిజనులో సుమారు 10 వేల రైతులు ఈ సంవత్సరం లాండ్‌రెవిన్యూ అస్సెస్‌మెంటును చెల్లించ నిరాకరించారు. ధరలు పడిపోవడం వల్ల ప్రభుత్వం తగినంత సహాయం చేస్తేనేగాని పన్ను లివ్వమన్నారు. బలవంతంగా పన్ను లు వసూలుచేస్తే సత్యాగ్రహం ప్రారంభించడానికి సిద్ధంగా ఉన్నామని కూడ బెదిరించారు. కాంగ్రెసు (సింధు) ఎసెంబ్లీ సభ్యులు ప్రత్యేకంగా మీటింగుచేసికొని చర్చించారు. అసెంబ్లీలో అడ్జెరన్‌మెంటు మోషన్ ప్రతిపాదించారు కూడాను, 28 వ తేదీకి వాయిదావేయబడింది.

★

### భూమి సెస్సు తగ్గించే బిల్లు.

బీహారు శాసనసభలో ఇంకొక సవరణబిల్లు తేబోతున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. 1937 భూమిసెస్సు చట్టం మూలాన జమీందార్లకు రైతులు సెస్సులు చెల్లించలేకపోవుచున్నారు. కావున జమీందార్లకు కౌలుదార్లు చెల్లించ వలసిన సెస్సును తగ్గించడమూ, దానితోపాటు, ప్రభుత్వానికి భూస్వాములు చెల్లించవలసిన సెస్సునుకూడా తగ్గించుటకునూ ఆసవరణబిల్లు ఉద్దేశము.

*

### భూస్వాములపై ఆదాయపు పన్ను

భూములవల్ల పెద్ద ఆదాయములు వచ్చేవారు, భూమిశిస్తుగాక, ఆదాయపు పన్ను వేరే చెల్లించవలెననే బిల్లును బీహారు శాసనసభలో క్లాజువారీగా చర్చించారు. బీహారు శాసనసభలోని జమీందారీ సభ్యులూ, ప్రభుత్వంవారు చేసుకొన్న రాజీఫలితంగా ప్రభుత్వంవారు అసలుబిల్లులో కొన్నిమార్పులు తెచ్చారు. 200 యకరములకన్న తక్కువ భూమి కలవారి ఆదాయపుపన్ను చెల్లించ నక్కరలేదనే సవరణ నెగ్గింది.

## ఆంధ్రదేశంలో

ఉత్తర విశాఖపట్టణంజిల్లా రైతు సంఘ కార్యనిర్వాహక వర్గం దూసిలో సమావేశమయింది. స్థానిక సంస్థలకు సివిక్‌బోర్డువారి నిర్ణయాలు, ప్రజామోదకరంగా లేవని, ప్రజాభిప్రాయం తెలిసికోకుండా నిర్ణయించడం సరికాదని, నిర్ణయాలను పునరాలోచింప వలెనని హెచ్చరించారు. జూన్ 11, 12 న తేదీలలో జిల్లారైతు మహాసభతోపాటు వ్యవసాయ పారిశ్రామిక ప్రదర్శనం జరుప నిశ్చయించారు. మన్యా రైతులకు, చిట్టివలస కార్మికులకు సానుభూతి చూపించారు.

★

కొప్పూరుతాలూకా, దారవరం, పెండ్యాల గ్రామాల రైతులు రైతుసంఘాల నేర్పరుచు కొన్నారు.

( మిగతా 18 వ పేజీలో )

## సంస్థానాలు

### మైసూరు—కాంగ్రెస్

మైసూరులో బాధ్యతాయుత ప్రభుత్వమును సూచించే ప్రణాళికను ఒక టి తయారు చేసి మైసూరు సంస్కరణముల కమిటీ ముందు పెట్టడానికి ఒక కమిటీని నియమించారు. మైసూరు పత్రికా రెగ్యులేషను రద్దు చేయాలంటూ తీర్మానం గావించబడింది.

సత్యమూర్తి గారు గాంధీ గారు చెప్పిన్నట్లు సంస్థాన పతాకకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి ముందుగ ప్రతిష్ఠించవలెనన్న ఉత్తరువుకు సంతసించారు.

★

మైసూరు కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశమయి అలిండియా వర్కింగు కమిటీవారు సూచించిన 'మైసూరు కాంగ్రెస్' అని ఉండరాదను సూచనను హానికరము—అనుచితము అనియు, వర్కింగుకమిటీ మళ్ళా ఇంకోసారి ఆలోచించుకొనవలెనియూ తీర్మానించారు.

ఇంకా పొలిటికల్ ఎఫయిర్సు కమిటీలో ఇప్పటివరకు ప్రభుత్వ సభ్యులే ఉన్నారని, ప్రజా ప్రతినిధులను కూడా చేర్చుకోవాలని మహాకతీర్మానం గావించారు.

★

...న్ సంస్థానాల ప్రజలసభ

...న్ సంస్థానాల ప్రజలసభ ... 22, 23 వ తేదీలందు జరి... సంస్థానాలలోని కాంగ్రెసు సంఘ... హరిపుర తీర్మానం వివారకర

వల్లభభాయి పటేలు

మనితీర్మానించారు. శంకరరావు దేవుగారు మాత్రం వ్యతిరేకంగా మాట్లాడిరి. సంస్థానాల పరిపాలనలో ఇండియా ప్రభుత్వం జోక్యం కల్గించుకోరాదు అన్న తీర్మానం కనులాదేవిగారు బలపరచారు.

సంస్థానాధిపతులు గౌరవంగా బ్రదుకుటూ మిత వ్యయం చేయాలనీ, కోఆపరేటివ్ సంఘా లవసరమనీ, హరిజనుల విద్యకు ప్రత్యేక వసతు లుండాలనీ, ఫెడరేషన్ ఏర్పరచే ముందు ప్రజలకు ప్రాథమిక హక్కుల నిచ్చుట, పౌరసత్వ హక్కుల కాపాడుట యుండవలెననీ ఫెడరల్ కోర్టులో న్యాయము బడయటానికి అవకాశముండాలని తీర్మానించారు.

*

మొదటిరోజున అధ్యక్షత వహించిన వల్లభాయి పటేల్‌గారు 'సంస్థానాధీశ్వరుల హృదయాల మార్చగల' మను నమ్మకం కాంగ్రెసు కున్నదని, ఖద్దరు, అస్పృశ్యతా నివారణ, గ్రామపరిశ్రమలు అభివృద్ధి పరచమని తెల్పారు.

సభను జరుపుకొంటానికి అవకాశమిచ్చినందులకు దర్బారుకు కృతజ్ఞత తెల్పుతూ హైద్రాబాదులో, బాధ్యతాయుత సంస్థ లేనందులకు విచారమును తెల్పుతూ మొదటిరోజున తీర్మానించబడింది.

★

### గ్రంథాలయంపై ఆంక్ష.

హైద్రాబాదులో జీవనగర గ్రంథాలయ వార్షికోత్సవం చేసికో కూడదని ప్రభుత్వం ఆంక్ష వేసింది. ఇలాంటివాక్స్వాతంత్ర్యాన్ని అరికట్టే ఆంక్షలు గత 9 నెలల నుండీ సాగుచున్నాయి.

## మన రాజకీయాలు

"వంగ దేశంలో గాంధి మహాత్మునికి రాజకీయ ఖయిదీల విషయం వదలివేసినా, ఇంకా విముక్తి జరగలేదు. కాబట్టి ఆశా భంగం కల్గుచున్నది. వెంటనే ప్రజలందరూ గట్టి ప్రయత్నాలు జరపాలి" అని అధ్యక్షుడు పలికారు.

## సంయుక్త పరగణాలు

### కాంగ్రెసు సంఘానికి విరాళం.

తమ రాష్ట్రంలోని ప్రతి కాంగ్రెసు శాసన సభ్యుడు తన అలవెన్సులో నూటికి 15 న్నుప్రతి పార్లమెంటు కార్యదర్శి, మంత్రి, నూటికి 5 ను కాంగ్రెసు సంఘానికి ఇవ్వాలని యు.పి. రాష్ట్ర కాంగ్రెస్ కౌన్సిల్‌లో ఒక తీర్మానం చేయబడింది.

★

### చౌరీ చౌరా ఖైదీలు.

సంయుక్త రాష్ట్రాలలోని చౌరీ చౌరా, గుల్‌హోతీ ఖయిదీలు రాజకీయ ఖైదీలే గావున విముక్తి చేయవలసినదని ఆందోళన ప్రబలంగా సాగుతోంది. వారు రాజకీయ ఖయిదీలు గావని ఎసెంబ్లీలో ప్రభుత్వం సమాధానం చెప్పింది. ఈ విషయం రాష్ట్ర కాంగ్రెసు సమావేశంలో చర్చకు వచ్చినపుడు ప్రభుత్వ సమాధానం అసంతృప్తిగా ఉందని నెహ్రూ కూడ అభిప్రాయ పడ్డారు.

★

### అ. భా. కాం. సంఘంలో మార్పులు.

అఖిల భారత కాంగ్రెసు కార్యాలయాలలో కొన్ని మార్పులు జరుగుతాయి. 'పార్లమెంటరీ కో ఆర్డినేషన్ బ్యూరో' అనే శాఖను ఒకటి కల్పించుతారట; శాసన సభా కార్యక్రమాలన్నీ సమీకరణం చేసి, కాంగ్రెసు శాసన సభ్యుల చర్యలను గమనిస్తూ ఉండటం దీనిపని. జూలైవ వారంనుండిబహుశా ప్రారంభమౌతుంది. 'విదేశ శాఖ'ను ఇంకా బలపరుస్తారట. కార్య సభ్యుల మార్పులు కూడా గల్గవచ్చు.

★

### విద్యా ఔన్నత్య.

విద్యాఔన్నత్య పోగొట్టడానికై సంయుక్తరాష్ట్ర ప్రభుత్వంవారు 10 లక్షలు ప్రత్యేకించుతారు. వయసు ముదిరినవారికి పవలుపనిలోమునిగి తీరిక లేనివారికి అవకాశం గల్గించే రెండుమూడు రకాల రాత్రి పాఠశాలలు నెలకొల్పుతారు. 12 గ్రామాలకొక గ్రంథాలయమూ, పఠన మందిరమూ, సంచార గ్రంథాలయాలూ రేడియో ఉపన్యాసాలు, మాజిక్‌లాంతర్ ద్వారా ఆరోగ్యవిధుల నేర్పడం; ఇవి కార్యక్రమంలో విషయాలు.

★

### కొత్త ఉద్యోగం.

ఐ. సి. యస్. పదవికి రాజీనామా నిచ్చి కాంగ్రెసులో చేరిన కామత్‌గారు అఖిలభారత కాంగ్రెసు కమిటీ కార్యాలయంలో పనిచేయుటకు అల్లాహాదు వెళ్ళారు.

★

### నెహూ! విదేశ యాత్ర.

జూన్ 2 వ తేదీన పండిట్ నెహ్రూ విదేశాలకు ప్రయాణ మగుచున్నారు. ఈ విషయమై అఖిల భారత కాంగ్రెసు విదేశ శాఖ కార్యదర్శి గారీ ప్రకటన గావించారు.

"నెహ్రూగారి ప్రయాణం విదేశాలలో భారతీయుల ప్రపంచ రాజకీయాలలో భాగాన్ని తెలియ జేస్తుంది. స్పెయిన్ పరిషత్వం వారి ఆహ్వానం అంగీకరించి మొదట స్పెయిన్ పోయెదరు. ఇంగ్లండు, ఫ్రాంసులకు కూడ వెళ్ళెదరు. ఇంకా వ్యవధి ఉంటే రష్యా, జకోస్లోకేవియాలు కూడ సందర్శిస్తారు. అమెరికా నుండి తప్పక రావలెనని ఆహ్వానాలు ఉన్నవి.

నెహ్రూ గారు ఒక సంవత్సరంలో తిరిగి రావలెనని తలంచుచున్నారు. తర్వాత ఆసియాలోని వివిధ దేశాలు చూడాలని తలంపు. ఇదివరకే అనేక దేశాలతో కాంగ్రెసు సంబంధం పెంపొందినది. వీటిని జవహర్‌లాల్ గారు బలపరుస్తారు. ఇంకా కొత్తగా ఏర్పరుస్తారు. ప్రజాస్వామ్య—సామ్రాజ్య వ్యతిరేక—సోషలిస్టు—అభివృద్ధికర సంఘాలతోనే సహజంగా ఆయన మైత్రి ఉంటుంది.

## బెంగాల్

### ప్యాసుపోర్టు నిరాకరణం

బెంగాలు జూట్ వర్కర్సుయూనియన్ కార్యదర్శి కలీన్ దాసు, బారిస్టర్ పరీక్ష చదవడానికై ఇంగ్లండు వెళ్ళడానికి అనుమతి కోరారు. కాని ప్రభుత్వం ప్యాసుపోర్టు ఈయ నిరాకరించింది.

★

### ఎక్స్టర్న్‌మెంట్ ఆర్డర్

కాకోరి కుట్ర కేసు ఖయిదీలగు శచీంద్రనాథబక్షి, జోగేష్ చంద్రఛటర్జీ గార్లు బెంగాల్‌లోఅడుగు పెట్టరాదని ఎక్స్టరన్‌మెంటు ఆర్డరిచ్చింది. దాని కసమ్మతి తెల్పుతూ బెంగాలులోఅనేక సభలు జరిగాయి.

### రంగపూర్ మండల రాజకీయ సభ

బెంగాల్‌లోని రంగపూర్ రాజకీయ సభ 21 వ తేదీన జరిగింది. ఆషాఫ్ ఉద్దీన్ చౌదరి అధ్యక్షత వహించారు.

కాంగ్రెసు హిందూ సంఘం కాదని పీడిత ప్రజల సంఘమని, పీడితులగు మహమ్మదీయు లందరూ చేరాలని అధ్యక్షులు సెల విచ్చారు.

## బొంబాయి

బీజపూర్‌లో కాంగ్రెసు ప్రభుత్వం ఉండగా రాజకీయ ఖయిదీలను కొరడాలతో కొట్టినందులకు దేశమంతటా నిరసించుచూ తీర్మానించారు.

బొంబాయి ప్రభుత్వం ఒక ఒక విచారణ కమిటీ ఏర్పరిచింది. ప్రభుత్వం జోక్యం వల్ల నిరసన వ్రతం పూనిన చెన్నూ సింగ్ మానివేశాడు.

★

ఖడ్గికార్ అనేకార్మిక శాసన సభ్యుడు బీజపూర్ చెరసాలలోనున్న షోలాపూర్ ఖయిదీల ఆరోగ్య పరిస్థితులను చూడటానికి 'ఇంటర్వ్యూ' అడిగితే "ప్రభుత్వ ఆజ్ఞ ప్రకారం చూడటానికి వీలు లేదు." అంటూ జైలు సూపరింటెండెంటు సమాధానం ఇచ్చాడు.

(మిగత 18 వ పేజీలో)



# అధికార దుర్వినియోగాన్ని బహిరంగపరచుట తప్పు కాదు.

★

## "కాంగ్రెస్ నుండి వెడల గొట్టగలరుగాని దేశసేవను అరిగట్ట జాలరు."

గుడివాడ తాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షుడు కానూరి బలరామయ్య గారికిని తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శియు తాలూకాకాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడగు కామ్రేడ్ వంగపాటి రంగారెడ్డి గారికిని. కృష్ణాజిల్లా విద్యార్థి సంఘ కార్యదర్శియును తాలూకా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులునగు కామ్రేడ్ కాట్రగడ్డ రాజగోపాలరావు. తాలూకా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శియును అఖిలభారత రైతుసంఘ ప్రతినిధియునగు కామ్రేడ్ వెట్టిపల్లి వెంకటరత్నం, తాలూకా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడగు కొసరాజు బ్రహ్మయ్య గార్లకును ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము నుండి ఈదిగువ శ్రీముఖములు చేరెను. ఉత్తరప్రత్యుత్తరము లీదిగువ వివరింపబడినవి.

సంజాయిషీలు సమాధానాలు.

గుడివాడతాలూకా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు శ్రీయుత కానూరి బలరామయ్య గారికి.

ఆర్యా! 11—3—38 తేది గుడివాడ తాలూకా కార్యనిర్వాహక వర్గంవారి సమావేశములో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ అధ్యక్ష కార్యదర్శులు శ్రీయుత భోగరాజు పట్టాభి శీతారామయ్యగారు, గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అవలంబించిన చర్యలకు నిరసనము చూపించుచూ చేసిన తీర్మానమును ఏల రద్దుచేయకూడదో, ఆతీర్మానమును చేయుటలో పాల్గొనిన మిమ్ములను తదితర సభ్యులపైన డిసిప్లనరీచర్య ఏల తీసుకొనగూడదో ఈనోటీసు అందిన మూడు రోజులలో సంజాయిషీ పంపవలయును.

చిత్తగించవలెను.

(సం.) బందా విన్నయ్య

ఆర్గనైజింగు కార్యదర్శి.

★

ఆర్యా,

మీ ఆర్గనైజింగు కార్యదర్శి గారు వ్రాసిన శ్రీముఖం చేరినది. మీరును మీ కార్యదర్శి బ్రహ్మయ్య గారును 1266 కాంగ్రెస్ ప్రాథమిక సభ్యుల హక్కులను తొలగించిన విషయములో మీ యుభయుల ప్రవర్తనను నిరసిస్తూ మీరు చేసిన అక్రమములకు తగు చర్య తీసికొనవలసినదిగా అఖిల భారత కాంగ్రెసు సంఘానికి సిఫార్సు జేసిన గుడివాడ తాలూకా కాంగ్రెసు కార్యవర్గ తీర్మానమును యేల రద్దు చేయగూడదో, ఆ తీర్మానము చేయుటలో పాల్గొనిన మాపైనను మిగతా సభ్యుల పైనను డిసిప్లనరీ చర్య యేల తీసికొనరాదో మూడు దినములలోగా తెలియ జేయాల్సిందని సంజాయిషీ అడిగినారు.

మీ ఉభయులపై ఆ తీర్మానము యెందుకు చేయవలసి వచ్చెనో ఆ తీర్మానములో గల కారణములే తెలియజేయగలవు. తూర్పు కృష్ణాలో కాంగ్రెసు సామ్యవాదుల పైనను అతివాదుల పైనను ప్రయోగించిన అనాగరిక చర్యలే ఆ తీర్మానం చేయడానికి ముఖ్య కారణములు. మే మా తీర్మానమును మీకును మాకును అధికార వర్గమును, న్యాయ నిర్ణయ కర్తలు నగు అఖిల భారత కాంగ్రెసు సంఘానికి మాత్రమే పంపియుంటిమి. బాధ్యత గల ఒకపై యధికారి తప్పు చేసినప్పుడు వారిపై యధికారులకు తప్పు చేయుచున్నారు గాన దండింప వలసిందని విన్నవించుటకు ప్రతివారికిని ప్రతి సంస్థకును న్యాయమైన హక్కు. రాష్ట్ర కాంగ్రెసు ఆశయాలకు మూల సూత్రాలకు భంగకరములగు తీర్మానములు క్రింది సంఘములు చేసినపుడు రద్దు చేయుటకు పై సంఘములకు అధికారము కలదని రాష్ట్ర కాంగ్రెసు నియమావళిలో ఖండితముగా కలదు. ఆ తీర్మానము మీ యుభయులు కాంగ్రెసు ఎన్నికలలో అధికార కాంక్షతో చేసిన అక్రుత్యాలకు సంబంధించింది కాని రాష్ట్ర కాంగ్రెసు ఆశయాలకు మూలసూత్రాలకు భంగకరమైనది కాదు. కాన ఆ తీర్మానము రద్దు చేయడానికి న్యాయ మాలోచించినచో వీలు లేదు. రద్దు చేయడానికి మీ కేవిధమైన అధికారము కూడా లేదు. మీరు క్రోధభావమును వదలి దూరదృష్టి వివేకముల నుపయోగించి పరిశీలించిన తెలియ గలదు. బహుశా మీ రీవిధంగా వ్రాయించడం రాష్ట్ర కాంగ్రెసు నియమావళిని బాగుగా పరిశీలించక పోవుటయని భావింతుము. అటుల తీర్మానించుటకు తాలూకా కాంగ్రెసు కార్యవర్గానికి సంపూర్ణాధికార స్వాతంత్ర్యాలు కలవు. 1266 ప్రాథమిక సభ్యుల విషయమై తాలూకాకాంగ్రెసు కార్యవర్గము సుమారు ఆరు మాసములనుండి అప్పీళ్ళతో విసిగి వేసారి కడపట ఆతీర్మానము చేసినది. అట్టి తీర్మానానికి మీరు సర్వవిధముల అర్హులు కూడ. దేశద్రోహులకు కాంగ్రెసును కళంకిత మొనర్చేటివారికి డిసిప్లినరీచర్య భయము కలిగించును గాని న్యాయమును బహిరంగపరచు విషయములో మమ్ములను భయపెట్టజాలదు. మీరు నిరంకుశత్వముతో వ్యవహరించినసనే తప్ప ఆతీర్మానము నెట్టిపరిస్థితుల్లోను రద్దుచేయడానికి వీల్లేదు.

### డిసిప్లనరీచర్య ఎందుకు తీసికొనరాదు?

మాపై డిసిప్లనరీ చర్య తీసుకోవడం గౌరవనీయం కాదు. బాధ్యతగల పై అధికారులు అధికార కాంక్షతో వ్యవహరిస్తూ తమ సంకుచితాశయాలతో యేకీభవించని వారిని కాంగ్రెసు అధికార పదవులకు రాకుండ చేయడానికి న్యాయాతిక్రమణ మొనర్చి కాంగ్రెసు ప్రతిష్ఠను మంటిపాలు చేయుచున్నపుడు దానిని బాధ్యతగల తాలూకా కాంగ్రెసు కార్యవర్గము నిరసించి అట్టివారిపై చర్య తీసికోవాలని అఖిల భారత కాంగ్రెసు సంఘానికి తెలియపరచడం విధాయక కృత్యమును, న్యాయమును కూడ. అందులకు మమ్ములను శిక్షించ బూనడం నాగరికతను వాంఛించెడి వారికి విధాయక కృత్యము కాదు. ఒక డిప్యూటీ కలెక్టరు గాని, ఒక కలెక్టరు గాని లంచగొండులై తమ విధిని అతిక్రమించినపుడు వారి పైయధికారులకు క్రింది యుద్యోగులు గాని ప్రజలు గాని వారిని శిక్షించాల్సిందని రిపోర్టు చేయుటకు న్యాయమైన హక్కు గలదు. అట్లనే మేమా తీర్మానమును చేసితిమి. న్యాయాన్ని బహిరంగపరచడం యెట్టి పరిస్థితుల్లోను దోషము కాదు. మీరు ఒక తూర్పు కృష్ణాలోనే కాదు, రాష్ట్రమంతటా అక్రమాలు చేశారనుటకు అనేక నిదర్శనాలు ఆధారములు కలవు. మీ అన్యాయాలచేత రాష్ట్ర మంతా పుడుకెత్తి పోయింది. ఆంధ్ర మహాజనులు ఆనందంతో మీ భుజస్కంధాల మోపిన అధికారాన్ని చాలా విచిత్రంగా మీరుభయులు దుర్వినియోగం చేశారు. కార్మిక కర్షకుల కొరకై అహోరాత్రాలు పనిచేస్తూ వారిలో స్వాతంత్ర్యాగ్ని రేకొల్పి కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాటాన్ని తీవ్రగతి నడిపించి భారత భావి భాగ్యోదయాన్ని త్వరలో పొందవలెననే సోషలిస్టుల మగు మే మెపుడును కాంగ్రెసునకు వ్యతిరేకులము కాము. మీ పరిపాలనకు వచ్చిన తరువాత నిజమగు కాంగ్రెసువాదులను వెళ్ళగొట్టి కాంగ్రెసు పేరుతో కులతత్వవాదులను చేర్చుకొని కాంగ్రెసు సంస్థను కుళ్ళుతోను దుర్గంధముతోను నింపినారు. తూర్పు కృష్ణా జిల్లా కాంగ్రెసు సంఘము అందుకు ఫలితంగా కాపు కమ్మ తగాదాలకు ముఖ్యరంగ మైనది. కమ్మవారే జిల్లాకాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శి పదవులు రెండును కాజేసినారని కాపులు జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సివిక్‌బోర్డు సభ్యత్వాలకు రాజీనామా యివ్వడం జరిగింది. ఇట్టి పరిస్థితులకు కారకులైన మీరు శిక్షకు పాత్రులా? మేమా? గుండెపై చేయి వేసికొని బాగా ఆలోచించ గోరెదము.

మమ్ములను మీరు మీ అధికార కాంక్షకు అడ్డు తగిలితిమని కాంగ్రెసు నుండి వెడలగొట్ట గలరు గాని మా దేశ భక్తిని దేశ సేవను అడ్డగించగలరా? మీరు చేసిన తప్పలను సవర్దించుకొనవలసినదని మేము మిమ్ములను సవాలు చేయుచున్నాము.

అన్యాయాన్ని బహిరంగపరచినందుకు మాత్రమే డిసిప్లనరీ చర్య అయినచో మేము దానిని హృదయ పూర్వకముగా ఆహ్వానిస్తున్నాము. మీరు డిసిప్లనరీ చర్య తీసికొనినను బయటనుండియే కాంగ్రెసు ప్రతిష్ఠ నినుమడింప చేయుటకు యథాశక్తిని ప్రయత్నించెదము.

ఇట్లు:

(సం॥) కానూరి బలరామయ్య

,, వంగపాటి రంగా రెడ్డి

,, కాట్రగడ్డ రాజగోపాలరావు

,, కొసరాజు బ్రహ్మయ్య

,, వెట్టిపల్లి వెంకటరత్నం

## కాంగ్రెసు సంఘాల అసమ్మతి.

"ఐకమత్యాన్ని కాపాడా లంటే శిక్షణా చర్యఉపసంహరించు కోండి."

అల్లూరి సత్యనారాయణ, గారపాటి సత్యనారాయణ గార్లపై డిసిప్లినరీ శిక్షణ తీసుకొన్నట్లు పత్రికా ప్రకటన చూచాం.

శిక్షకు గురియైన వీరిద్దరూ గతసంవత్సరం పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు అధ్యక్ష కార్యదర్శులు. అల్లూరి సత్యనారాయణ గతసంవత్సరం, ఈ సంవత్సరం, అఖిలభారత కాంగ్రెసు సభ్యుడు కూడాను. వీరియువురూ స్వాతంత్ర్య పోరాటంలో సుశిక్షితులైన సైనికుల్లా పని చేశారు. కాంగ్రెసు కార్యక్రమాన్ని ముందుకు కొంపోయారు.

ఇలాంటి వారిపై ఆరోపించ బడిన నేరాల గురించి ఎట్టి విచారణ లేకుండా శిక్ష విధించడం, ఐకమత్యానికి భంగకరం చీలికలు గల్గడానికి అవకాశం. నిర్ణయాలను వ్యతిరేకించి కాంగ్రెసు సంస్థకు అప్రతిష్ఠ తెచ్చేవారిపైన, స్వార్థపరులపైన చర్య తీసుకోవాలి గాని, నిరంతరం కాంగ్రెసు బలాన్ని ప్రతిష్ఠను కాపాడే వారిపై చర్యకు గడంగడం అరిష్టదాయకం.

ఇలాగే కృష్ణాజిల్లాలో శెట్టిపల్లి ప్రభృతులపై కూడ చర్య దీసికొనినట్లు కన్పించుచున్నది.

ఇది ఐక్యతకు భంగకరమేగాక అనేక వైషమ్యాలకు మనస్పర్థలకు కారణం అవుతుంది. స్వాతంత్ర్య పోరాటం సన్నగిల్లడానికి హేతువవుతుంది.

ఈ విషయాలన్నీ రాష్ట్ర కాంగ్రెసు సంఘాధికారులు గుర్తించేందుకు, రైతు, కార్మిక, యువజన, విద్యార్థి, స్త్రీ, కాంగ్రెసు సంఘాల వారు తీర్మానాలు చేయాలి. శిక్షణాచర్యను ఉపసంహరించుకొనేటట్లు ఒత్తిడి తేవాలి. తీర్మానాలు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి, అఖిల భారత కాంగ్రెసు సంఘానికి, పత్రికలకూ పంపాలి.

ఉ. రామం
అధ్యక్షుడు
నరసాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ.

★

### బహిరంగ విచారణ కావాలి.

గ్రామ కాంగ్రెసు సంఘ అధ్యక్ష కార్యదర్శులకు విజ్ఞప్తి

అఖిల భారత కాంగ్రెసు సంఘ సభ్యుడగు కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణ మొదలగు వార్లపై రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు డిసిప్లినరీ చర్య తీసుకొని, కొన్ని నేరారోపణలు చేసి 2 సంవత్సరముల వరకు ఏ కాంగ్రెసు సంఘంలోను సభ్యుడుగా ఉండరాదని శిక్ష విధించినట్లు రాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి గొట్టిపాటి బ్రహ్మయ్య గారు పత్రికలలో ప్రకటించినారు.

నేరారోపణలలో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ అధ్యక్ష కార్యదర్శులను, వర్కింగు కమిటీ సభ్యులను అనవసరముగా దూషించినట్లున్న కలదు. ఫిర్యాదులే ముద్దాయిగు సత్యనారాయణగారిని శిక్షించినారు. రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు బాగుగా విమర్శించి, దూరాలోచనచేసి నిర్ణయించినట్లు కనుపించుట లేదు. కాబట్టి తాలూకా కాంగ్రెసులోని గ్రామకాంగ్రెసు సంఘాలన్నియు, రాష్ట్ర కాంగ్రెసు వారు చేసిన నిర్ణయమును సవరించుకొని, ముద్దాయి వాదమును, సాక్షులను పూర్తిగా విచారించు సావకాశములు కలుగజేసి, బహిరంగ విచారణ సల్పి న్యాయము జరుగువరకు తీవ్రమైన ఆందోళన సాగించుచూ, తీర్మానములు చేసి రాష్ట్ర కాంగ్రెసు సంఘం వారికి తాలూకా కాంగ్రెసు సంఘంవారికి కాపీలు పంపగలందులకు హెచ్చరించుచున్నాను.

భీమవరం
20-5-38

ఇట్లు:
కె. వెంకటేశ్వరరావు
సం॥ కార్యదర్శి
భీ॥ తా॥ కా॥ సంఘం

★

### "ఇది అక్రమం"

రాంభొట్లపాలెం గ్రామ కాంగ్రెసు సంఘం 19—5—38 వ తేదీన సమావేశమై ఈ దిగువ తీర్మానాన్ని యేకగ్రీవంగా ఆమోదించింది.

"ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్య సంఘము వారు ప్రముఖ కాంగ్రెసు, యువక నాయకులైన అల్లూరి సత్యనారాయణ, శెట్టిపల్లి వెంకటరత్నం మొదలగు వారి పైన తీసికొన్న డిసిప్లినరీ చర్య అక్రమమైన దనిన్నీ, సామ్రాజ్య వ్యతిరేక జాతీయైక్య సంఘటనానికి విరుద్ధ మనిన్నీ ప్రజా పోరాటానికి తీరని నష్టమనిన్నీ యీ సంఘం వారు తలుస్తూ యిప్పటికైననూ ఆ చర్యలను రద్దు చేయవలసినదిగా రాష్ట్ర సంఘమును కోరుచున్నారు. అతివాదులను యీ విధంగా వెళ్ళగొట్టడం కాంగ్రెసును బలహీన పరచడమే యగును. కాన ప్రతి గ్రామ, తాలూకా సంఘమువారును తమ అభిప్రాయాన్ని స్పష్టపరచి రాష్ట్ర సంఘాన్ని మందలించి ఆంక్షను తొలగించేటట్లు చేయాలని కోరుచున్నాను."

మ. లక్ష్మీ నారాయణ.
కార్యదర్శి.

★

### "ఖండింపదగినది"

జమీ గొల్వేపల్లి గ్రామ కాంగ్రెసు సభ్యులు 20—5—38 సమావేశమై ఈ తీర్మానమును గావించిరి.

శ్రీ అల్లూరి సత్యనారాయణ వగైరా ప్రముఖులపై ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘము వారు విచారణ లేకయే డిసిప్లినరీ యాక్షను తీసుకొనుటను యీ సభవారు ఖండించుచూ వెంటనే సక్రమమైన బహిరంగ విచారణ జరిపించవలసినదిగా యీ సభవారు రాష్ట్ర కాంగ్రెసు వారిని కోరుచున్నారు.

★

### సోషలిస్టుల తీవ్ర అసమ్మతి.

"రాష్ట్ర సంఘాన్ని మందలించండి"

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం వారు, అల్లూరి, గారపాటి వగైరాలపైన డిసిప్లెనరీచర్య తీసుకొన్నారు. యువజన, సోషలిస్టు సంఘాలలో వీరు బాగా కృషి చేశారు. ఇట్టి వారిపైన అర్థంలేని, బుజువుకురాని నిందలమోపి కాంగ్రెసులో నుంచి బయటకు గెంటడం కూడని పని. జాతీయైక్య సంఘటనకు విరుద్ధం. ప్రజా పోరాటానికి నష్టం. కాంగ్రెసును బలహీనపరచడం. ఫెడరేషన్‌ను ఎదుర్కోడానికి ముస్లింలీగ్‌తో సహకారాలు వాంఛించే ఈరోజుల్లో తీవ్రవక్తలను కాంగ్రెసునుండి బయటకు గెంటడం తీవ్రనష్టం. కాన సోషలిస్టు యువజన, విద్యార్థి, రైతు, స్త్రీ సంఘాలు తీర్మానాలుచేసి, రాష్ట్రసంఘాన్ని మందలించి తమ దృక్పథం మార్చుకొనేటట్లు చేయాలి.

కె. రామశాస్త్రి
తాలూకా సోషలిస్టుపార్టీ కార్యదర్శి.
రేపల్లె.

★

### ఇది నాయకత్వపు పెనుగులాట

డిసెప్లెనరీచర్యలు అధికమయినాయి. క్రొత్తగా మెంబర్లను చేర్చుంచాక వచ్చింది ఈగోల. కొందరు పెత్తందార్లగా ఉందామని దబ్బుకట్టి మెంబర్ల చేర్పించారు. అలాంటి వాళ్ళకి, కాంగ్రెసు ద్వారా ప్రజాసామాన్యంలో చైతన్యం కల్గించేవారిని జూస్తే మంటగామా వారందరూ వీరిపై కల్లి బొల్లి మాటల కల్పించారు.

ఫెడరేషన్, కారనేషన్, కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీ మొదలైన తీవ్రసమస్యల విషయమై మాటాడకుండా ముక్కుమూసుక కూర్చొని, ఏవో సంస్కార పద్ధతుల్లో కొట్టుకులాడుతూ ఉండేవారికి వీరిపై మంట ఎందుకుండదు?

ఒకసారి చైనాను జ్ఞప్తికి తెచ్చుకొని తీవ్రశక్తుల నన్నిటి బలపరచాలి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుసంఘం. ప్రజాపోరాటం గమనించరా? నాయకత్వపు పెనుగులాట మానేస్తారా? లేదా? లోపాలు దిద్దుకోపోతే చరిత్రే తెలియజేస్తుంది విప్లవశక్తుల ముందు ఎవరూ నిలవలేరని.

ఇకనైనా అల్లూరి మొదలగు వారిపై డిసిప్లెనరీచర్య ఉపసంహరించు కొంటారా? లేక తమ వ్యక్తిత్వాని నిలబెట్టుకోడానికి స్వాతంత్ర్య పోరాటాన్ని అరిగడతారా?

నరసరావుపేట
23—5—38

శ్రీగిరిరాజు,
సత్యనారాయణ.
గుంటూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ

★

### "పిడుగువంటి వార్త"

పట్టాభిగారికి కొన్ని ప్రశ్నలు???

మహారాజశ్రీ ఆంధ్ర రాష్ట్ర సంఘాధ్యక్షులకు :—

అర్యా,

అల్లూరి సత్యనారాయణ ప్రభృతులపై డిసిప్లినరీ చర్య తీసికొన్నా రన్న వార్త పిడుగు వలె వచ్చింది. ఈ సందర్భాన క్రింది విషయాలకు సమాధానం ఇస్తారా?

1. శ్రీ అల్లూరి సత్యనారాయణ గారిపై నేరా లేమిటి?

2. నేరాలను ఆరోపిస్తూ లిఖిత పూర్వక మగు కంప్లెయింట్లు వచ్చినవా?

3. కంప్లెయింటుదారు లెవరు?

4. కంప్లెయింట్లపై విచారణ జరిగిందా?

5. కంప్లెయింటుదారులే విచారణాధికారులా? మరెవ్వరైనా?

6. ప్రాథమిక హక్కగు బహిరంగ విచారణ, జ్యూరీ విచారణ జరిగిందా?

( మిగతా 15 వ పేజీలో )



# చైనా మిమ్ముల రక్షించుచున్నది!

## బ్రిటిషు ప్రభుత్వానికి కార్మిక సభ్యుని హెచ్చరిక

ఫిలిప్ నోయెల్ బేకర్

( పార్లమెంటు సభ్యుడు )

అనుకున్నట్లుగా జపానుకు చైనా యుద్ధంలో త్వరలో ముగియలేదు. చాల ధనవ్యయం అవుతున్నది. జనరల్ స్టాఫ్ అంతా వసువునదికి ఉత్తరదేశాన్నంతా కొన్నివారాలలోనే జయించగల మని, 40 వేల సైనికులు చాలునని తలంచారు.

వారు 50 వేలకుపైగా పంపించారు. మంచూకోలో తిరుగుబాటును అణచటానికి 120,000 మందిని పంపింది. జపానుకు విపరీత ప్రాణనష్టం సంభవించింది. ఎప్పటి కప్పుడు కొత్తసైన్యాల అవసరం కల్గుతూ వచ్చింది. జపాన్, టాంకులను, విమానబలానికి, విషవాయువులకు వ్యతిరేకంగా శైశవావస్థలో నున్న చైనా సైనికబలం నిలవగల్గింది దృఢంగా. జపాను కొట్టే దెబ్బకు ఎదురు దెబ్బ కొడుతూనే వచ్చారు చైనావారు. తాత్కాలికంగా జపాను జయించి పొగొట్టుకున్న ప్రదేశాలపై ఎదురు దాడి సాగించి జయించారు.

ఈ నాడు చైనా చరిత్రలో ఎన్నడూ ఎరగని జాతీయ ఐక్యత కన్పడుతున్నది. ఇది ఈ యుద్ధఫలితం. ఇన్నర్ చైనాలోని కమ్యూనిస్టులు తమ ప్రభుత్వాలను రద్దుచేసికొని జంగ్-కై-షేక్‌తో కలసి జపాన్‌తో పోరాడుతున్నారు. కాంటన్‌లో సంశయింపబడే భాగం ఈ నాడు 250,000 సైనికులను పంపుతున్నది. ఇంకా అవసరమైతే లక్షలకొలది పంపడానికి తయారుగానుంది.

పీకింగ్ నగరం చుట్టూ, జపాన్ సైనికుల వెనక గొరిల్లా యుద్ధాలు ప్రారంభమయినవి. మంచూకోలో 1931 నుండి జపానుకు పక్కలో బల్లెమై, నిద్రపోనీయని "బందిపోటులు"(రాజకీయపు బందిపోటులే.) ఒక మహాతరగం లేచినట్లు లేచారు. విదేశాలలోని చైనావారు కూడ తమ మాతృదేశ విషయమై ఇదివరకుకంటె అధికంగా శ్రద్ధ తీసుకొంటున్నారు. తమదేశం దేనికి పోరాడుతుందో ఆ వాంఛకై గుమి గూడుతున్నారు. మాతృదేశంలోని సైన్యాల సహాయార్థమై ధనాన్ని పోగుచేస్తున్నారు. అమెరికా యూనివర్సిటీలలోని విద్యార్థులు, మధ్యాహ్నపు భోజనం మానివేస్తున్నారు. బజార్లలో బూట్లను తుడిచి డబ్బు పంపుతున్నారు పిల్లలు తమ దేశానికి. స్త్రీలు తమ నగల్ని అమ్ముతున్నారు. ఈ విషయాలన్నీ చారిత్రకంగా ఎంతోప్రాముఖ్యత పొందవలసినవి. చీని అర్థం ప్రతిచైనావాని హృదయాన్నీ మనస్సునూ చైనా జాతీయత జయించినదన్నమాట. ఏ దేశంలో ఉన్నా జాతీయత అతన్ని బంధించింది. ఉత్తరాదివారనీ, దక్షిణాదివారనీ ఇదివరకు కల్పింపబడ్డ విభేదాలు నశించాయి. జపాను సామ్రాజ్య వాదులకు తాళంవేసే ద్రోహులు పన్నాగాలు బయటపడి నశించాయి. నేడు చైనా ఒకజాతి. కలిసి నిలబడటానికి సిద్ధంగా ఉన్నది. జీవితాన్ని ధనాన్నీ, స్వీయ క్షేమ సౌఖ్యాలను దేశ క్షేమంకోసం బలి చేయడానికి నిర్మించేదాకా వారు నిద్రపోరు. జపాన్‌కు స్వాధీనమయిన భాగాలలో కూడ అవసరం వచ్చినపుడు, వీలు గల్గినపుడు లక్షల కొలది ప్రజలు చైనా స్వాతంత్ర్య దేశానికి సహాయం చేస్తారని వారికి తెలుసు.

కాని ఈ పోరాటంయొక్క అంతిమ ఫలితం భేదింపవచ్చు. సమితి జపాను నరికట్టడానికి ఆంక్ష విధిస్తే తప్ప జపాన్ సైనికనాయకులు విజయవార్తాలతో తమయుద్ధ కేగవచ్చు. వారికి విజయం కల్గగడం అంటే—వారు పతనమయ్యేలోగా దశాబ్దాల కొలది పోరాటము-అరాజకము తలచూపుతుంది.



జపాను బాంబుల ఫలితం.

తయారుగా ఉంది.

ఈ క్షణంలోని హద్దులదాటి వెనుదిరిగి చూస్తే ఈ విషయాలను గ్రహించగల్గుతాం. చైనా ప్రజలను శాశ్వతంగా జయించగల మను ఆశ- కల- వ్యర్థమయి పోయింది. జపాను సైనిక నాయకులు కోరుతున్న ఆశలన్నీ వృధా అయినాయి. ఈ పోరాటంయొక్క ఫలితం ఏమైనాగానీ, జపాను ఈ పోరాటం అంత మొందేటపుడు ఏదేశాలు కావాలని అడిగినా అడగనివ్వండి, కాని స్వాతంత్ర్య చైనాదేశము తాను మొదలెట్టిన కార్యక్రమాన్ని పూర్తిగావించుతుంది. జపానుతో సరిసమానమైన. సమాన ధైర్యంగల, నిపుణతగల విమాన బలం.

దానివల్ల జపానుకు చైనాకు—ప్రపంచానికి కల్గే ఫలితం ఏమిటి? జపానులో ఫాసిజమూ— దారిద్ర్యం తాండవమాడటమూ. మంచూరియా పరిపాలనం పార్లమెంటరీ విధానాన్ని, శాసనబద్ధ పద్ధతిని అణచి మిలటరీ క్లిక్కులకు కారణం అయింది. అది ఆర్థికంగా ఏమీ లాభం తేలేదు. జపాను ఎత్తుగడ పూర్తిగా విఫలమయినది. మంచూరియాను మిలటరీ పరిపాలనక్రింద అట్టిపెట్టి పరిపాలించినందుకు ఫలితంగా వర్తకంలోగాని, రెవిన్యూలోగాని అధికం ఏమీ రాలేదు. జపానుకు, ఇక చైనావిషయం, అమానుషమగు బాధల ననుభవించడం, ప్రాణ నష్టం, మానవజాతిలో నాల్గవ భాగము మిలటరైజు (సైనికుల) చేయడం నాంకింగు ప్రభుత్వం మొదలెట్టిన జాతీయాశయానికై అభివృద్ధిని బలిదానం గావించడం.

ప్రపంచానికో? చైనాలో వర్తకనష్టం. అరాజకం, అసంతృప్తికి కేంద్రమైన మరోభాగంలో కష్టాలను తట్టుకోవడం. జాతిసమితి శవపేటికకు మరో మేకు కొట్టడం. సమితి పనిచేయడానికి మరొక మహదవకాశాన్ని పోగొట్టు కోవడం. యుద్ధ పర్యవసానంగా కలిగే అరాజక సముద్రంలో మునిగిపోవడం.

ఈ వినాశనాలన్నిటినీ తప్పించ వీలులేదా? తప్పకుండా తప్పించవచ్చు. జపాను ఆర్థిక దశఅంతా విదేశ వర్తకం మీద ఆధారపడివుంది. అది ఎగుమతి చేసేవాటిలో నూటికి 28 పాళ్ళు ఈక్రిందివి. ముడిసిల్కు—కృత్రిమసిల్కు లేక తయారయిన సిల్కు—నేత గుడ్డలు. ఈ మూడింటినీ లేకుండానో, లేక ఇతర ప్రదేశాలనుండి తెప్పించుకొనో, ఆయా దేశాలవారు గడుపుకోవచ్చు. ఈచిన్న పనులవలన జపాన్‌కు గొప్ప ఒత్తిడి తేవచ్చు.

నానా జాతి సమితి సభ్యులు జపాను రేవులకు లీగ్ మెంబర్ల పడవలేవీ పోగూడదని, జపాను సరుకుల నెగుమతి చేసికో గూడదనీ ఏల నిర్ణయించరాదు? ఒక్క అమెరికా దీనికి తలఊపితే ఇదే తగినంత పని. ఇంకా నూనె సప్లయి మానితే, జపాను, విమానబలం, టాంకులు, ఫిరంగులు యుద్ధనౌకలు, వ్యర్థ మయిపోతవి.

అలాంటి బహిష్కరణమే నిజంగా చేస్తే, జపాను ప్రజలు తమ మిలటరీ అధికారుల అన్యాయ అక్రమణను సహోర్థు చేయరు. 10 నెలల క్రితమే జనరల్ ఎలక్షన్‌లలో మిలటరీ నాయకులు ఓడిపోయారు. (యుద్ధానికిపూర్వం) జపానులో తిరిగివచ్చిన యాత్రికులు అపుడే ప్రజలలో అసంతృప్తి హెచ్చుచున్నదని చెప్పుచున్నారు.

ఈ అవకాశాలన్నీ ప్రభుత్వాలన్నీ ఉపయోగించుకొని జాతిసమితిని పునర్నిర్మించే అవకాశం బ్రిటన్‌పై ఉన్నది. కాని బ్రిటన్ నాయకత్వం వహించడం లేదు. మన మంత్రులు వెనుదీస్తున్నారు. తూర్పు దేశాలలో తమ క్షేమాలకు ఈ యుద్ధంవలన నష్టం వస్తుందని వారికీ తెలుసు, కాని వారు కావలసిన కార్యక్రమాన్ని ముందుకు పెట్టడంలేదు.

మనం ప్రజలను సంఘటితమొనర్చి తీవ్ర ఆందోళనచేస్తే బ్రిటన్‌కూడా ప్రజాభిప్రాయానికి లొంగుతుందని నా అభిప్రాయం.

# కార్మిక సమస్యలు

★

### కాన్పూరు

కాన్పూరు సమ్మె తీవ్రంగాను, ప్రశాంతంగాను జరుగుతూంది. యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ బాబూ రాజేంద్రప్రసాద్ గారి కమిటీ సూచనలను బలపరచింది. కాని, కార్మికులు తమ నాయకుల మాట వినక, ప్రభుత్వపు టుత్తరవులకు వేచి యుండక సమ్మె చేయడానికి విచారం తెల్పింది. (ప్రభుత్వ మధ్యవర్తి పరిష్కారానికి కార్మికులు 8 నెలలు వేచియు [illegible]. ఇంకా వేచి యుండా [illegible]) ఇలా హఠాత్తుగా సమ్మెలు జరప [illegible]. సమ్మెలను బలహీనపరస్తుందని [illegible]ప్రాయం. గవర్నమెంటు ఉత్తర[illegible] మిల్లుయజమానులు పాటించక [illegible] అంగీకరించనిఫ్యాక్టరీ వస్తువులను బహిష్కరించడానికి ఒక ఉపసంఘం [illegible] చారు రాష్ట్రకాంగ్రెసు సంఘంవారు.

లక్నోలో ఒక బహిరంగసభ జరిగింది. నెహ్రూ మిల్లు యజమానుల చర్యలను ఖండించుతూ ఉపన్యసించాడు. ఆ సభలో ఒకతీర్మానం ప్యాసయింది. "ప్రభుత్వ సలహాలను మిల్లు యజమానులంగీకరించకపోతే మిల్లు యజమానుల మిల్లుల ఖరీదునిచ్చి వాటిని స్వాధీన పరచుకోవాలి." ఇదే తీర్మానం.

యజమానుల సంఘంవారొక ప్రకటన గావించారు. తాము 'లాక్-ఔటు' చేయలేదనీ, కార్మికులకు తమకు సఖ్యత కూర్చేటటువంటివిన్నీ, కార్మికులకు యజమానులకు లాభకరమై నటువంటివిన్నీ సంభవమైన విధానం చూపించమని దాని సారాంశం. వారి అభిప్రాయంలో ప్రభుత్వం కార్మికుల పక్షపాతం వహించిందని. పికెటింగు జోరుగా సాగుతోంది. గుమస్తాలను, తెల్లవారినికూడా పోనీయకుండా చేస్తున్నారు. 24 వ తేదీన కొందరు బలవంతమైన పికెటింగు చేస్తున్నారని ఇ. పి. సి. 341 సెక్షన్‌క్రింద 5 గురు కార్మికులను అరెస్టు చేశారు. అందులో నల్గురికి ఒక్కొక నెల శిక్ష విధించారు. ఐదవవానికి పదిరూపాయలు జుల్మానా, ఇవ్వకపోతే 10 రోజుల శిక్ష విధించారు.

జి. డి. బిర్లా (పెద్ద పెట్టుబడిదారుడు) మధ్యవర్తిగా ఉండి ఈ తగాదా పరిష్కరింపవలెనని కొందరు కోరుతున్నారు.

మళ్ళా పికెటర్లను 46 మందిని అరెస్టు చేశారు. ఒక్కొక నెల శిక్ష విధించారు. స్త్రీలు కూడా పికెటింగు చేయనారంభించారు. వీరిసంఖ్య 20 మంది. పట్టణ కాంగ్రెసు సంఘం చందాలు. ఆహారపదార్థాలు ప్రోగుచేస్తుంది.

మిల్లు యజమానులసంఘం ప్రభుత్వానికొక అపీలు చేసింది. పికెటర్లు శాంతియుతంగా లేరని, దౌర్జన్యం వహించుచున్నారని, గుమస్తాలను అడ్డగించడం పౌరసత్వ హక్కులకు భంగకరమనీ. 27 వ తేదీకి స్త్రీ పికెటర్లు 100 మంది వరకు హెచ్చారు. ఎర్రబాడ్జీలు ధరించి పట్టువలతో పికెటింగు చేస్తున్నారు. దీనికి కారణం అరస్టులే. అరస్టులవల్ల పట్టుదల హెచ్చింది.

28 వ తేదీ వార్తల ప్రకారం విద్యామంత్రి స్వామీ సంపూర్ణానంద్ (పూర్వం సోషలిస్టు) గారు స్వయంగా మిల్లు పరిసరాలను పోయి పరిశీలించి చూచాడు. పికెటింగు శాంతంగా జరుగుచున్నదనీ, దౌర్జన్యం ఏమీలేదనీ, [illegible]లకు అవకాశం లేదని ప్రకటన గావించాడు.

"రోడ్లమీద నడవడానికి కూడ మజదూర్ (కార్మిక) సభవారి అనుమతి పొంది చీట్లు చేతిలోవుంచుకొంటేనేగాని నడవ వీలు లేకుండా పోతున్నదని" మిల్లు యజమానులు చేసిన ప్రకటన నిజం కాదని కార్మికులు అట్లు నిరోధించమన్నట్లు పోలీసు సూపరెండెంటుకు కాని తనకు గాని ఒక పితూరియైన రాలేదని జిల్లా మేజిస్ట్రీటు ప్రకటించాడు. అతడు స్వయంగా పరిస్థితులను పరికించాడు. గుమాస్తాలను నిరోధించనక్కరలేదని సమ్మె కమిటీ బహుశా నిర్ణయిస్తుందని తెలుస్తోంది.

కాన్పూరు జనసంఖ్యలో ఆరవవంతు ఉంటారు సమ్మెచేసినవారు. కార్మికులు రోజుకు 25 వేల రూపాయలదాకా జీతం పోగొట్టుకొంటున్నారు. జూటు మిల్లుల రెండింటిలో, 7 హోసిరీ మిల్లులలోను, తోళ్ళ ఫ్యాక్టరీలోను పని నిలచిపోయింది. సమ్మెవల్ల బట్టల వర్తకులకు కూడా దెబ్బతగిలింది. బ్యాంకులుకూడా చాలా నిద్రపోతున్నాయి. లక్షలకొలది యూనిట్లు సప్లైచేసేవారు ఎలక్ట్రిక్ కంపెనీవారు. ఇపుడు దాదాపు రోజుకు 8 వేల రూపాయల నష్టం వస్తున్నది కంపెనీకి. పికెటింగు శాంతంగా జరుగుతున్నది. అక్కడక్కడ చిన్నఘర్షణలు ఆంగ్లో ఇండియన్ గుమాస్తాలకు పికెటర్లకు వస్తున్నా శాంతికి భంగం కల్గడం లేదు.

లక్నో, అల్లాహాదు కాంగ్రెసు కమిటీల నుండి సహాయం, సందేశాలు వచ్చాయి. వార్డుకాంగ్రెసు కమిటీలు పట్టణకాంగ్రెసు సంఘ ఆజ్ఞప్రకారం ఆహార పదార్థాలు డబ్బు ప్రోగుచేస్తున్నారు. సభఃజరుపుతున్నారు ఆదివారంనాడు హరతాళం జరిపారు. మిల్లు యజమానుల 'దౌర్జన్య కృత్యాలను' నిరసించుతూ ఒకతీర్మానానికి డిస్ట్రిక్టుబోర్డులో నోటీసు ఇచ్చారు.

ఒక విచిత్రమైన ఘటన. మిల్లు యజమానియైన రామరత్న గుప్తగారు సిటీ కాంగ్రెసు కమిటీకి వైసు ప్రెసిడెంటు. కాంగ్రెసు తీర్మానం ప్రకారం సమ్మెను ప్రోత్సహించవని వారిపై డిసిప్లినరీ యాక్షన్ తీసుకొంటారు. ఆయన వార్డులో సమ్మెదార్లకు ఎలాంటి సహాయం చేయదలచారని ఒక ఉత్తరం వ్రాశారాయనకు. ఈచిక్కులో పడిన గుప్తగారు కాంగ్రెసు కంటె సొంతపెట్టుబడి ప్రియతమమైనది కాబట్టి త్వరలో రాజీనామా ఇస్తారట! సమయం వస్తేగాని రంగు ఎపుడూ బయటపడదు!

పారిశ్రామిక మంత్రి పరిస్థితులను ప్రధాన మంత్రిగారికి తెలియజేయడానికై నైనిటాలు వెళ్ళారు.

"మరో ప్రభుత్వం స్థాపించారు కార్మిక సభవారు" అన్నగగ్గోలును విచారించడానికి వచ్చిన సంపూర్ణానందగారు అంతా శాంతంగా ఉన్నదని చెప్పారు. ప్రభుత్వంకూడా అలాంటి ప్రకటనే ఒకటి గావించింది.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీ, మొదటినుండి యజమాను లవలంబించుచున్న చర్యను నిరసిస్తూ, కార్మికులకు సానుభూతి తెలిపారు. పరిశ్రమలభివృద్ధి పొందాలిగాని, కార్మికులను దారిద్ర్యంలో, ఆకలితో ఉంచి, అమానుషంగా చూస్తూకాదని అభిప్రాయ పడ్డారు.

### పుకుచ్చేరి

పుదుచ్చేరిలో ఉండే వివిధపరిశ్రమలలోని కార్మికులకు సంవత్సరమునకు 15 రోజులు నిండు జీతంతో క్యాజువల్ లీవ్ ఇవ్వవలెనని ప్రభుత్వం ప్రకటించింది.

### జమ్‌షెడ్‌పూర్

తాతాకుప్పు కంపెనీ పనివారు తమకష్టాలపోగొట్టుకొనకుంటే సమ్మెచేస్తామన్నారు. బీహార్ అసెంబ్లీ ఉపాధ్యక్షుడు. అబ్దుల్‌బారీగారు కార్మికులకు ఉపన్యసించారు రాజీకోసం మధ్యవర్తిసంఘం(కాన్సిలేషన్‌బోర్డు)ను ఏర్పరచింది. ఈ బోర్డువారు విచారించి, తప్పంతా కార్మికులదేనని, తమ కోర్కెలు యజమాన్లకు విన్నవించే పద్ధతి ఇది కాదనీ, యజమానులను సమర్థిస్తూ రిపోర్టువ్రాశారు. సమ్మె జరిగే చోటికి అదనపు పోలీసు దళాలు పంపబడ్డాయి.

### కలకత్తా

కలకత్తా విద్యుచ్ఛక్తి పనివారల కోర్కెలు కొన్నింటిని అంగీకరిస్తూ కార్పొరేషను ఏజెంటు ఒక ప్రకటన చేశారు. ఆప్రకటనలో అతడు సూచించిన షరతులు ఒక్కకార్మికునికి కూడా నచ్చలేదు. కార్మికులు పెద్దఊరేగింపు జరిపి బహిరంగ సభ నేర్పాటు చేశారు. ఆదివరకులేని పోటీ కార్మిక యూనియన్ ఒకటి ఏర్పాటుచేసి, దానికి ప్రీమియము నివ్వడానికి దానిద్వారా తమ ఐకమత్యాన్ని చెడగొట్టడానికిని ఏజెంటుచేసే ప్రయత్నాలు ఖండించారు. 4000 కార్మికులచే సంతకాలు చేయబడిన పిటీషను ఒకటి యీవిషయాలన్నీ తెలియపరుస్తూ లండన్‌లో నున్న, ఆ కంపెనీ డైరెక్టర్లకు పంపడానికి కూడా నిశ్చయించారు.

### అలిపూర్.

అలిపూర్‌లో గవర్నమెంటు టెలిగ్రాఫ్ వర్కర్లు తమకష్టాలు నివారించే ప్రయత్నం కనక ప్రభుత్వం త్వరలో చేయకపోతే సమ్మె చేయవలసి వస్తుందని హెచ్చరించారు. వారి కష్టాలు

(మిగతా 13 వ పేజీలో)



# నేటి ప్రపంచం

### జమైకా కార్మికుల పోరాటం.

"జమైకాలోని కార్మికుల సమ్మె సాగుతున్నది. తీవ్రతకూడా చెందింది. ప్రదర్శనం—ఉత్సవంసాగించుచున్న కార్మికులపై పోలీసులు కాల్చారు. ఇద్దరు చనిపోయారు. ఇద్దరిని అరెస్టు చేశారు. పోలీసు స్టేషన్ ముందు ప్రదర్శనంచేసి నందులకై 70 మందిని కస్టడీలోకూడ పెట్టారు.

వ్యక్తుల ప్రాణాలకు, ఆస్తికీ నష్టం తలపెట్టడంవల్ల మిలటరీని పిలవవలసి వచ్చిందని, పనికివెళ్ళపోతే కన్సిలియేషన్‌బోర్డు ఏర్పరిచి పరిష్కరించుతామని గవర్నర్ ప్రకటన చేశాడు." ఇదీ ఈవారపు వార్త జమైకా, కార్మికుల గురించి. దీనికిపూర్వ సమాచారం తెలుసుకోవాలి. జమైకా బ్రిటిష్‌వారిది. చిన్నదీవి. వెస్టిండియన్ ఐలాండ్స్ లోనిది. 10 లక్షలమంది జనాభా. 20 వేలమంది తెల్లవాళ్ళు ఉంటారు. ముఖ్యంగా పంచదార పరిశ్రమ జాస్తిఇక్కడ. మే మొదటివారంలో ఇక్కడ చెరకు కూలీలు తిరుగబడ్డారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇలా చిన్నచిన్న దీవులలో కార్మిక పోరాటాన్ని అయుధబలంతో నాశనం గావించడం మొదటి సారికాదు. ఈమధ్యనే 'మారిషస్,' 'ట్రినిడాడ్'లలో కార్మిక విప్లవాలను అణచివేశారు బ్రిటిష్‌వారు.

జమైకాలో కార్మికుల సమ్మెకు కారణం జీతాలు పడిపోవడమే. కొన్నిచోట్ల 9 పెన్నీలకు పడిపోయింది. వెస్టిండీస్ సుగర్ లిమిటెడ్ కంపెనీ కొత్తపద్ధతి ప్రారంభించిందట, దానితో కార్మికులు తిరగబడ్డారు. కర్రలు, గొడ్డళ్లు పుచ్చుకొని జీతాలిచ్చే ఆఫీసును ముట్టడించారు. కిటికీలు, తలుపులు బద్దలుకొట్టి ఆఫీసరు లిండో పైన బడ్డారు. లిండో ఒక రివాల్వర్ తీసుకొని గాలిలోపేల్చి పారిపోయాడు. కార్మికులు చెరుకుకు నిప్పంటించారు. ఆకంపెనీ యజమాని ఆఫీసుకు పోయారు. ఆఫీసులోకి జొరబడవద్దంటూ మేనేజరు 'గ్రాంటు' ఆజ్ఞాపించాడు. కాని కార్మికులు కదలలేదు. కింగ్‌స్టన్ నుండి టెలిఫోనుద్వారా ఈవార్త విని పోలీసులు వచ్చారు. గొడ్డళ్ళు, పంపుముక్కలు, రాళ్లధాటికి పోలీసులు ఆగలేకపోయారు. పోలీసులు కాల్చారు. నల్గురు చనిపోయారు. 50 మంది గాయపడ్డారు. ఒక స్త్రీని బాయనెట్లతో పొడిచారు. 89 మంది సమ్మె నాయకులను అరెస్టుచేసి ఖైదులో వేశారు.

తర్వాత 3 వేల మంది కింగ్‌స్టన్ ఆఫీసులముందు ప్రదర్శనం గావించారు. 'జమైకాస్టాండర్డు' అనే పత్రికా కార్యాలయంముందు ఈప్రదర్శనం, ఆపత్రికా సంపాదకుడు కార్మికుల దెబ్బతేశకాను స్వీకరించుతానని వాగ్దానం గావించాక కార్మికులు వెళ్ళిపోయారు. [illegible] నీగ్రోలు ఆఫీసులోకి తన్నుగావచ్చి "ఈదీవిలో పరిస్థితులు భయంకరంగా ఉన్నాయని ఇంగ్లండుకు చెప్పు" అని అన్నారు.

కొన్నిచోట్ల కార్మికులకు 9 పెన్నీలు జీతమట! కొందరు కార్మికులు, పంట ఇండ్లలోను, పాకీ ఇండ్లలోను కాపరం ఉండాలిసి వస్తున్నదట! గతిలేక ఆవాగాల వదలి బయటనే కాపురంచేసు కొంటున్నారు.

పత్రికా సంపాదకుడు ఇలా తెలియజేశాడు. "ఆకలిమంట దారిద్ర్యం ఇక్కడ తాండవించుతుంది." అని.

బ్రిటన్ పరిపాలన ఇలా ఉంది జమైకాలో, ఇక్కడే ఏమిటి? సామ్రాజ్యవాద లక్షణమే ఇది.......

### స్పెయిన్ ఓడిపోలేదు!

29 వ తేదీన రోములో విద్రోహప్రారంభోత్సవ, సంబరంచూపిస్తూ ఉత్సవాలు జరిగాయి, "ఈనాడు సామ్రాజ్య ఇటలీకి యువజనులు పోరాడవలసి తయారు చేయాలి. రేపు గొప్ప ఇటలీకి." అని అన్నాడు. ముసోలినీ. ఫాసిస్టు నాయకుడు ఎస్టేరిమాట్లాడుతూ 12 ఏండ్లక్రింద ముస్సోలినీ వాగ్దానంగావించాడని, ఈనాడు వాగ్దానం తీర్చాడని, అవసరమైతే ఫేసిస్టు స్పైన్ తమ కృతజ్ఞత చూపుతుందనీ తెల్పాడు. ఇదివరకే బట్టబయలయిన విషయం ఫేసిస్టులు సహాయం చేస్తున్నారని. ఈ విషయం తమనోటి ద్వారా తెల్పారుఫాసిస్టులు.

మస్సోలినీ

ఈ వారం స్పానిష్ యుద్ధచరిత్ర ఒకసారి పరికించుదాం. దీనివలన తేలేదేమిటి? స్పైన్ ఓడిపోలేదు! పోలేదు!! అని.

టెరూల్ ప్రాంతాల యుద్ధం తీవ్రమైంది. విద్రోహుల 18 విమానాలను ప్రభుత్వం పడగొట్టి ఇటలీవారిని ఖైదు చేసింది. తర్వాత సాగంటో, కాస్టెల్లన్, ఆలికాంటీ నగరాలపైన విద్రోహులు బాంబులవేశారు. ఆలికాంటీవద్ద బాంబులవల్ల చనిపోయినవారిసంఖ్య 378 వరకు ఉంటుందని తేలింది. 1000 మందిదాకా గాయపడ్డారని ఫ్రెంచివార్తలు తెల్పుచున్నాయి.

కాటలోనియాలో కూడ తీవ్రమైన యుద్ధంసాగింది. విద్రోహులు తాము ఓడినట్లు ప్రకటించడం లేదు. ప్రభుత్వమూ తగినంత జయంపొందినట్లునూ ప్రకటించ లేదు. బార్సిలోనాపై విద్రోహులు కూడ బాంబులువేశారు, కాని రక్షణ ఏర్పాట్లలో అభివృద్ధి గాంచడంచేత అష్టే నష్టంలేదు. టెరూల్‌ప్రాంతాల కొంత విద్రోహులకు విజయం లభించింది.

నాన్‌ఇంటర్వెన్షన్ కమిటీ ఇంకా పని చేస్తూనేఉంది. ఆంగ్లో- ఇటలీ ఒడంబడిక ప్రకారం ఇటలీ తమవారిని వెనక్కి మరల్చాలి. ఎన్నో నెలలబట్టి ఈ సైన్యాలని మరల్చడంగురించి తగాదాలువచ్చాయి. కాలం వెళ్ళబుచ్చడం తప్ప ఈ కమిటీ ఏమిచేయలేకపోయింది.

ఈకమిటీ ఇపుడుకొన్ని నిర్ణయాలకు వచ్చింది, అవిఇవి. వెనక్కి మరల్పవలసినవారలలో సైనికులు, నావికులు, విమానాల నడపువారు, పౌరులు ఉండాలని, ఒక్కొక్కసారి 10 వేలమందిని వెనక్కి మరల్చాలని.

ముఖ్యంగా రష్యా అంగీకరించని విషయం ఇంకొకటి. 15 రోజులవరకు భూమిపైన కంట్రోల్ వహించడం. అంటే క్రొత్తవారినిగాని, ఆయుధాలనుగాని పంపకుండా ఉండటం అన్నమాట. ఈలోగా 'విత్‌డ్రాయల్' వ్రలంటీర్లను వెనక్కి మరల్చడం, పూర్తిగాకపోతే మరొకనెల పొడిగించుతారు. ఇంకా అత్యవసరమైతే 10 రోజులు పొడిగించుతారు.

దీనివలన దాదాపు రెండు నెలలదాకా ఎట్టి సహాయం స్పైనుకు పోదన్నమాట! ఇదివరకున్న ఆంక్ష వలననే స్పైన్ ప్రభుత్వం బాధపడుతుంది. దీనివలన మరింత సంకెళ్ళ బిగుస్తవి. ఈరెండు నెల్ల ఆంక్షవలన ఫ్రాంకోను బలపరచడం అవుతుంది. రష్యా దీనికంగీకరించక ఉండటంలో ఆశ్చర్యమేముంది?

### చైనా జపాను యుద్ధం

లంహై రైల్వే ప్రాంతాలనే చైనాజపాను యుద్ధం కేంద్రీకరింపబడింది. లాంగ్‌ఫెంగును పట్టుకొనడానికి జపాను తీవ్రకృషి చేసింది.

జపాను వత్తిడి వలన జర్మనీ తటస్థంగా ఉండదలచింది. ఇదివరకు చైనాకు సలహాదారులుగ నున్న 40 మంది జర్మనీ సైనిక నాయకులు చైనావిడిచి పెట్టాడు, వైద్యసహాయం చేయడానికి వచ్చిన రెడ్‌క్రాస్ సొసైటీకూడ వెళ్ళిపోతున్నది.

ఇన్నర్‌మంగోలియానుండి చైనాసైనికులు పీపింగ్ ప్రాంతాలకు తండోపతండాలుగా వచ్చి పడ్డారు. పీపింగ్ పశ్చిమ ప్రాంతాలలో చైనాకే విజయం లభించింది. చాంగ్-పింగ్, సూయియూవన్ భాగాలను పట్టుకొన్నారు. మంచూరియాలో చైనాకు 30 లక్షలసైన్యమూ, జపానుకు 20 లక్షలసైన్యమూ ఉందని చైనా లెక్కవేస్తున్నారు.

తీవ్రయుద్ధం సాగాక చైనా, లాంగ్‌ఫెంగ్‌వద్ద ఓడిపోయింది. జపాన్ చుట్టుకమ్ముకొని వచ్చిందని 160 వేల మంది చైనా సైనికులు ఓడిపోయారని చైనా బ్రిగేడ్‌లో 2500 మంది లాంగ్‌ఫెంగ్ వద్ద చనిపోయారనీ జపాను ప్రకటించింది. కాని చైనావార్తల ప్రకారం లాంగ్‌ఫెంగు పట్టుకోబడినా చైనా జపానును తీవ్రంగా ఎదుర్కొంటున్నదట! మళ్ళా లాంగ్‌ఫెంగువద్ద జపాను ఓడిపోయిందనికూడా మరొక వార్త!

జపాను విమానులు కాంటన్ నగరంపై బాంబులు వేశారు. 1[illegible] విమానాలు తిరిగి

(మిగతా 12 వ పేజీలో)

# నవశక్తి

1—6—38 బుధవారం

## ఆంధ్రరాష్ట్రం కావాలి, రావాలి

ఆంధ్రరాష్ట్ర విషయంపట్ల ఆలిండియా కాంగ్రెసు వర్కింగు కమిటీవారు చూపిన వైఖరి ఆంధ్రదేశంలో చాలా నిరుత్సాహాన్ని అసంతృప్తిని, నిరాశను కూడ కలుగ జేసింది. ఈ సమస్యపట్ల గతసంచికలో కొంతవరకు మా అభిప్రాయమును ప్రకటించి యుంటిమి. అనంతరము కాంగ్రెసు అధ్యక్షులగు సుభాస్ చంద్రబోసుగారి అభిప్రాయము, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులగు డాక్టరు పట్టాభిగారి అభిప్రాయం పత్రికలలో ప్రకటింపబడినవి. కాని ఆంధ్రులకేమాత్రము ఆశాజనకముగా లేవు. అయినను కొంతవరకు వర్కింగుకమిటీ వారి వైఖరిలోని అంతర్యము వెల్లడియైనది.

'భాషాప్రయుక్తరాష్ట్ర విభజనసమస్యపై కాంగ్రెసు యొక్క వైఖరి యిదివరకే స్పష్టంగా వెల్లడియైనది. కాని ప్రస్తుతము కాంగ్రెసు కేంద్రప్రభుత్వమున అధికారము లేనిదే యీ ఆశయమును సాధింపగలదో నాకు బోధపడుటలేదు. ప్రస్తుతము తనసభ్యులను బ్రిటిషు ప్రభుత్వమువద్దకు విజ్ఞప్తులతో పంపుటగాని రాయబారముగా పంపుటకాని చాలప్రమాదకరము."

ఇవీ బోసుగారి అమూల్యవచనాలు. ఆంధ్ర పత్రికావిలేఖరి దెల్పినటుల ఆలోచించి, ఆలోచించి, సంశయిస్తూ, సంశయిస్తూ, ఆఖరికి విధిలేక, విధిలేక, ఆంధ్రులకీ ఆశాభంగకరమగు సందేశమునిచ్చారు బోసుగారు. రాష్ట్రసంఘాధ్యక్షులగు డాక్టరు పట్టాభిగారన్నట్లు శాస్త్రీయంగా ఆంధ్రరాష్ట్ర వర్కింగు కమిటీవారు సిఫార్సుచేసిన ఆంధ్రరాష్ట్ర రాయబార తీర్మానాన్ని నేరుగా ఆలోచించి సూటిగా దానిపై వోటు(Straight vote )ను ఆలిండియా వర్కింగు కమిటీవారు తీసికోలేదు. స్పీకరుగారి రాజీనామాసందర్భంలో మాత్రమే యీవిషయమై చర్చింపబడి నిరాకరింపబడింది. ఏదైనా మొత్తంమీద విఖ్యాత కాంగ్రెసువాది యెవరు మాత్రం రాయబారంలో ఉండకూడదని నిర్ణయింపబడింది. ఒకవేళ స్పీకరుపదవికి రాజీనామా నిచ్చినను సాంబమూర్తిగారు కాంగ్రెసులో సామాన్యసభ్యులుగా నున్నంతకాలము రాయబారము పోకూడదని నిశ్చయించుటలోని అంతర్యమిదియే. కాంగ్రెసేతర రాయబారము నిష్ప్రయోజనమను విషయముందరెరింగినదే. అంటే రాయబారం అగ్గిమైనట్లే అర్థం. రాయబారాన్ని నిషేధించినప్పుడు ఆలిండియా వర్కింగు కమిటీవారు చేసే యితర ప్రయత్నాలను గూర్చి వెల్లడిస్తే ఆంధ్రులకు కొంత మనశ్శాంతి కల్గుతుందని పట్టాభిగారు చక్కని మాట శలవిచ్చారు. బోసుగారి ప్రకటనలో కొంతగూఢంగా ఉన్నది వర్కింగు కమిటీవారు చేయబోయే ప్రయత్నం. "కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వంలో అధికారంలేనిదే యీఆశయాన్ని యెటుల సాధింపగలదో బోధపడుటలేదన్నారు. ఆయధికారంవస్తే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమెంతసేపు? అనివారిభావం. ఆయధికారానికి ప్రయత్నిస్తోందామన్నట్లున్నది ఆలిండియావర్కింగు కమిటీ వారి వైఖరి. ఫెడరేషనుపై యీమధ్యనే మహాత్మగాంధి వైస్రాయితో మాట్లాడియున్నాడు. ఎట్టిపద్ధతులపై కాంగ్రెసుకు బ్రిటిషు ప్రభుత్వానికి రాజీజరుగవచ్చునో కూడా సూచించాడు హిందూపత్రికావిలేఖరి. బుల్లాభాయి దేశాయిగారు ఇంగ్లాండులో సంచారంచేస్తూన్నారు. బాహ్యంగా కనపడే విషయం చూస్తే జెట్లండు ప్రభువు (ఇండియాప్రభుత్వకార్యదర్శి) లండను నుండి ఫెడరలు విధానంలో లేశమైన మార్పుండదని హుంకరించారు. వెంటనే "సంపూర్ణాధికారం వస్తేనేగాని తృప్తిపడం మేము. చిన్నమార్పులెవరికి కావాలి" అని సింహగర్జనచేసెను రాష్ట్రపతి బోసు. అయితే రాజీ యెట్లుసాధ్యము? అని అడుగుతారు స్థూలదృష్టితో. నిరుడు మంత్రిపదవీ స్వీకారానికి ముందు మహాత్మగాంధి కాంగ్రెసు వర్కింగు కమిటీ, గవర్నర్లు తమప్రత్యేకాధికారాలను ప్రయోగించరని హామీకావాలన్నారు.

"అసంభవము— అసలు గాంధిమహాత్ముడు సరిగా చట్టమునే చదువలేదు" పొమ్మన్నాడు జెట్లండుప్రభువు. హామీయివ్వడం అసంభవమైతే "మావాళ్ళు మంత్రిత్వాలు పుచ్చుకోవడం అంతకన్న అసంభవ"మని గర్జించింది జవహర్ కిశోరం కాంగ్రెసు పీఠంనుండి. కాని ఆ గర్జనలఅనంతరం బహుకొద్ది కాలానికే కాంగ్రెసుకు గవర్నమెంటుకు రాజీపొసగడం, కాంగ్రెసు ఏడురాష్ట్రాలలో మంత్రివర్గాలు ఏర్పాటుచేయడం కూడా జరిగింది. అందుచే ఇప్పుడు ఆవంక జెట్లండుప్రభువు బింకంవల్ల, యీవైపు బోసుయొక్క తీవ్రతవల్ల ఫెడరేషనువిషయమై రాజీజరుగుట కేవలము అసంభవమని అనుకొనుటకు వీలులేదు. రాజీ సంభవమై కాంగ్రెసుకు కేంద్రప్రభుత్వంలో అధికారంవస్తే ఆంధ్రరాష్ట్రం రావడమెంతసేపు? ఇది బోసుగారి గూఢవచనాల అంతరార్థం కావచ్చును. పట్టాభిగారి విష[illegible]యాన్ని మరుగులేకుండానే చెప్పివేశారు బందరునుండి పత్రికాప్రతినిధితో. ఫెడరేషనుసమస్య 1939 వ నవంబరునెలకు పరిష్కారమవుతుందని బ్రిటిషుగవర్నమెంటు ఆశిస్తూందని పట్టాభిగారే శలవిచ్చియున్నారు. కాని అదేస్టేటుమెంటులో పట్టాభిగారు "ఫెడరేషనుసమస్య తేలేవరకు మనము వేచియుండజాలము" అని వక్కాణించియున్నారు. నిజంగా కాంగ్రెసుకు బ్రిటిషు ప్రభుత్వానికి రాజీకుదిరి తత్ఫలితంగా ఫెడరేషనుసమస్య పరిష్కారమయి కేంద్ర ప్రభుత్వములో కాంగ్రెసుకు అధికారం 1939వ నవంబరులోగా ప్రాప్తమయ్యేయెడల ఆంధ్రులు అంతవరకు (17 నెలలు) కూడ వేచియుండజాలరనియా పట్టాభిగారి భావము? కాదు. ఫెడరేషనుసమస్య విషయంలో రాజీజరుగుతుందనే నమ్మకం వారికిలేదు. అందుచే వారు వేచియుండజాలమని" వచియించిరి. సరే ఆంధ్రులు వేచియుండజాలరు. ముమ్మాటికిని వేచియుండజాలరు. అయితే వారలనేమి చేయమందురు? శాసనసభ్యులు రాజీనామానివ్వుట "ఉచితానుచితజ్ఞాన"శూన్యమన్నారు. కొందరు వర్కింగు కమిటీ వైఖరిపట్ల అసమ్మతిని ప్రకటించుచు తిమనాల్గనాల కాంగ్రెసు సభ్యత్వమునకు కూడ రాజీనామా నిచ్చేస్తే దానిని "నిరాశావాదం" క్రింద కొట్టివేశారు. ఇక వారిచ్చిన ఆశాజనకమైన సలహాయేమి? ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు కమిటీకంటె పురాతనమైన ఆంధ్రమహాసభ యున్నదికదా! ఆసభాస్థాయి సంఘమువారు చక్కైన యేర్పాట్లు చేయాలన్నారు. రాష్ట్రసంఘాధ్యక్షులుగా తాము రాయలసీమలో సంచారమొనర్చి శ్రీబాగు ఒడంబడికను సాధించి సౌహార్ద్రసమితిని సంచారము చేయించి ఆలిండియాకాంగ్రెసు కమిటీలో గత అక్టోబరులో ఆంధ్రరాష్ట్రనిర్మాణప్రయత్నమును కాంగ్రెసుమంత్రివర్గము చేయవలెనను హెచ్చరికతీర్మానమును ప్రతిపాదించి దానిని ప్యాసుచేయుటకు తోడ్పడి, తుదకు రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీచే, రాయబారాన్ని నిర్ణయింపజేసి బహిరంగంగా సాంబమూర్తిగారి రాజీనామాను ఆమోదించి ఆంధ్రరాష్ట్ర రాయబారమును సాంబమూర్తిగారే నడపుదురని ఆంధ్రులకెంతో ఆశకల్పించి యిప్పుడేమనుచున్నారు నాయకవర్యులైన పట్టాభిగారు? "ఉన్నదిగదా ఆంధ్రమహాసభ ప్రత్యేకంగా దీనికోసం. అదే చేస్తుంది పొమ్మంటున్నారు. అందుచేతనే విజయనగరంలో మూడవతేదీని జరుగబోయే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు వర్కింగుకమిటీ కార్యక్రమంలో ఆంధ్రరాష్ట్ర రాయబారముయొక్క [illegible]



ఆంధ్రరాష్ట్రకోసం పట్టాభిగారెంతో పనిచేసి ఆంధ్రులలో ఆశల నంకురింపజేశారు. గతరాష్ట్ర కాంగ్రెసుసంఘసభ్యులయెన్నికలలో పట్టాభిగారిని తిరిగి రాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షులుగా జేయుటకు తోడ్పడిన వారినే యెన్నుకోవలెనని పలువురు ఆంధ్రరాష్ట్రాభిమానులు పనిచేశారు. పట్టాభిగారీమారు ఆంధ్రరాష్ట్రసంఘాధ్యక్షులుకాక పోతే ఆంధ్రరాష్ట్రమేలేదు పొమ్మన్నారు. పట్టాభిగారు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘాధ్యక్షులే కారు. ఆలిండియా వర్కింగు కమిటీలో కూడ మెంబరయినారు. అయినా ఆంధ్రమహాసభ ఉన్నదికదా ఆంధ్రరాష్ట్రం కోసం అంటున్నారు ఇప్పుడు. స్వదేశసంస్థానల ప్రజలకు నిరుడంతా వారెంతో ఆశకల్పించి ఆఖరుకు సంస్థానాలలో పేరుకుమాత్రం కాంగ్రెసు సంఘాలుంటే చాలునని సవరణపెట్టి ప్యాసు చేయించారు. ఈమేము ఆంధ్రులకెంతో ఆశకల్పించారు ఆంధ్రరాష్ట్రవిషయంలో. ఇప్పుడుమరో ఆంధ్రమహాసభ పాహిమాం పాహిమాం అనమంటున్నారు. అంతేకాని రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీ మీటింగు కార్యక్రమంలో ఆంధ్రులో కొన్ని యింత కలవరపరుస్తూన్న యీ సమస్యను చేర్చుటకైనా పూనుకొనరైరి.

ఫెడరేషనుతో యీ సమస్యను ముడిపెట్టుటను మేము అంగీకరింపము. ఫెడరేషను విషయంలో రాజీరాయబారములు సల్పుటయే కాంగ్రెసు తీర్మానమునకు విరుద్ధమని మావాదము. ఆరాయబారములెవరు చేసినను గర్హ్యములని మాయభిప్రాయం. ఫెడరేషను సమస్య తేలువరకు యితరవిషయములలో రాయబారములెల్లు ఆగలేదో ఆంధ్రరాష్ట్రవిషయమై కూడ ఆగకూడదని మాయభిప్రాయం. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు వర్కింగు కమిటీ యీ సమస్యను పరిష్కరించుటకు నడుముకట్టితీరాలి అని మేము హెచ్చరించుచున్నాము. పట్టాభిగారు ఈ సమస్యను అజెండాలో చేర్చక పోతే చేర్పించే బాధ్యత రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీ మెంబర్లపైనున్నదని మనవి చేస్తున్నాం. వెంటనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘముసమావేశమై యీ విషయంలో ఆలిండియా వర్కింగుకమిటీవారు తమ నిర్ణయాన్ని మార్చుకొనునట్లు కోరవలెను. కర్నాటక రాష్ట్రంకోసం కర్నాటకులు సత్యాగ్రహం చేయాలని తీర్మానం చేస్తూంటే ఆంధ్రులు తొందర పడకూడదు అంటారు ఆంధ్రనాయకులు. ఆంధ్రులందరు భేదభావాలు విడనాడి ఐకమత్యంతో [illegible] ఢిల్లీ అసెంబ్లీలో తీర్మానం ప్యాసు చెయ్యాలి. కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆంధ్రరాష్ట్రనిర్మాణం అత్యవసరాన్ని వెంటనే గమనించాలి. ప్రతి కాంగ్రెసుకమిటీ "ఆంధ్రరాష్ట్రం కావాలి రావాలి" యని తీర్మానించాలి. భారతదేశానికి స్వరాజ్యం, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రం అనే నినాదం మిన్నుముట్టాలి.

## ఆంధ్రయువకులపై ఆంక్ష

ఆలిండియా కాంగ్రెసు వర్కింగు కమిటీవారు ఆంధ్రరాష్ట్రవిషయమై పట్టాభి ప్రభృతులనమ్రతోసి రాజన్నంయులకు ఆంధ్రులందరు వగచుచున్నారు. కాని యిక్కడ పట్టాభి ప్రభృతులేమి చేయుచున్నారు? భారత స్వరాజ్యముకొరకును ఆంధ్రరాష్ట్రము కొరకును అవసరమైనచో ఆహుతియగుటకు సంసిద్ధులుగానున్న ఉత్సాహవంతులగు యువకులపై ఆంక్షలను విధించుచున్నారు. తమ్మేమో అవమానించిరి? దౌర్జన్యముచేయ పురికొల్పిరి? యని యేమేమో చెప్పి అల్లూరి సత్యనారాయణ, గారపాటి సత్యనారాయణ, కొట్టెపల్లి వెంకటరత్నం, కానూరి బలరామయ్యగార్లకు కాంగ్రెసు సంఘములలో స్థానము లేకుండా జేసినారు. మొదటి యిరువురు రెండేళ్ళు ఏ యెన్నిక కాంగ్రెసు సంఘములలోను సభ్యులుగా నుండగూడదట. నాల్గవవారు ఒక సంవత్సరం ఉండకూడదట. వెంకటరత్నంగారు మూడేళ్ళపాటు అసలు సాదా కాంగ్రెసు సభ్యులుకానే ఉండరాదట. ఇది రాష్ట్ర కాంగ్రెసు వర్కింగు కమిటీవారి నిర్ణయము. అప్పుడే ఆంధ్రదేశమందు అనేక చోట్ల సభలు జరిగి ఈ శిక్షణ చర్య సంపూర్ణంగా ఖండింపబడినది. కొన్ని కాంగ్రెసు సంఘాలు అప్పుడే తమ అసమ్మతిని తెలియ చేసినవి. తాడేపల్లిగూడెంలో శ్రీ కొమ్మరెడ్డి చిన[illegible]యులుగారి అధ్యక్షతక్రింద యీవారంలో జరిగిన వివిధ తాలూకా కాంగ్రెసుసంఘాల అధ్యక్ష కార్యదర్శులసమావేశములో సరియైనవిచారణ లేకుండా శిక్ష వేసినారనిన్నీ, పునర్విచారణ చేయవలెననిన్నీ తీర్మానించినారు. కొన్ని తాలూకాలలో తాలూకా రాజకీయ సభలు కూడ శిక్షలకు పాత్రులైన యీ యువకుల అధ్యక్షతను వరించుచున్నవి. ఈ నెల 16 వ తేదీన భీమవరం తాలూకా రాజకీయ మహాసభ అల్లూరి సత్యనారాయణగారి అధ్యక్షత క్రింద జరుగునని వార్త యిప్పుడే మా కార్యాలయమునకు చేరియుండెను. నర్సాపురం తాలూకా రాజకీయమహాసభ [illegible] వ తేదీని [illegible]మున జరుగుననికూడ తెలియుచున్నది. ఇదివరకే ఆంధ్రకాంగ్రెసు నాయకత్వం చాలవరకు యువకుల బలమును గోల్పోయి యున్నది. ఇప్పుడీ చర్య యువకులను పూర్తిగా రెచ్చగొట్టినదని వచ్చుచున్న వివిధవార్తలనుబట్టి వెల్లడియగుచున్నది. రైతు యువజన కార్మిక సంఘాలు పెక్కు ఖండనతీర్మానములను పంపుచున్నవి. స్త్రీసంఘాలు రాష్ట్రాధికారుల చర్యను నిరసించుచున్నవి.

డిసిప్లినరీ చర్యకు పాత్రులైన నల్గురు సామ్యవాద యువకులే. కాంగ్రెసు యెన్నికలలో పెక్కుచోట్ల మితవాదులకును అతివాదులకును సంఘర్షణ హెచ్చయినది. పశ్చిమ కృష్ణా జిల్లాలో బహిరంగముగా రోడ్డుపై బెజవాడ కాంగ్రెసు సంఘ సభ్యుడు సామ్యవాద యువకునొకనిని చావగొట్టుటయు జిల్లా కాంగ్రెసు కమిటీవారు అతని చర్యను గర్హించి అతనిపై చర్య తీసుకోవలెనని కోరుటయు, పార్లమెంటరీ కార్యదర్శి కాశీశ్వరరావుగారు సైతము ఆ సభ్యుని దుష్ప్రవర్తనమును ఖండించుటయు జరిగినది. కాని యింతవరకు రాష్ట్రకాంగ్రెసువర్కింగు కమిటీవారు అతనిపై చర్యను తీసుకోలేదు. ఈ యువకులపై తగిన కారణాలులేక సరియైన విచారణలేక, తామేఫిర్యాదీలై తామే జడ్జీలై కాంగ్రెసు సంఘాలనుండి వారిని వెడలగొట్టుట అతివాదులనణచి వేయుటకు పన్నిన కుతంత్రమని చెప్పకతప్పదు. దౌర్జన్యనేరారోపణము మిథ్యయని ముద్దాయీలు తమసంజాయిషీలలో స్పష్టముగా నిరూపించినారు. నిష్పాక్షికమైన విచారణను కోరినారు. విచారణ లేకుండ శిక్షించడమను నిరంకుశ పద్ధతి ఆంధ్ర కాంగ్రెసు రాజకీయములను మలినపరచుచున్నది. బహిరంగ విచారణయన్న పట్టాభి ప్రభృతులకు భయమెందులకు? శిక్షింపబడిన నల్గురిలోను అల్లూరి సత్యనారాయణగారు ఆలిండియా కాంగ్రెసు కమిటీలో మెంబరు కూడాను. అతనిపై చర్యతీసుకొనుటకు ఆలిండియా వర్కింగు కమిటీవారేనిజముగా అధికారులు. ఈ చర్యలనుగూర్చి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘములో శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు తుంగభద్రలోనే ప్రస్తావిస్తే వర్కింగుకమిటీపై డిసిప్లినరీచర్యల విషయంలో జనరలుబాడీకి అధికారములేదని అధ్యక్షులు పట్టాభిగారు [illegible] రాష్ట్రకాంగ్రెసు కమిటీ తనచే యెన్నుకోబడ్డ వర్కింగుకమిటీ [illegible]

1907 లో అతివాదులను కాంగ్రెసునుండి తరుమగొట్టి కాంగ్రెసును కన్వెన్షనుగా మార్చివేసిన మితవాద నాయకత్వమువలె, బీహారులో కిసాన్ సేవకులపై ఆనుధ్వ్రప్రబలిన కాంగ్రెసు మితవాద నాయకత్వ దాశినలె అంధ్రదేశంలో అతివాద యువకులపై నిప్పులు ఆంక్షలరూప కంగాదాటి ప్రారంభమైనది. అల్లూరి సత్యనారాయణగారు తమ సంజాయిషీలో చెప్పినట్లు కాంగ్రెసు కమిటీలలో యేర్పడిన స్పర్థను కప్పుపుచ్చుకొనుటను మరచిపోయి కాంగ్రెసు సేవను ఉత్సాహముతో చేయుచున్న రోజులలో "మాయుచున్న పుండును తిరిగి రేపుటకు" రాష్ట్రాధికారులు పూనుకొనుట ఔదార్యము కాదు సరికదా రాజనీతి కూడ కాదని మనవి చేయుచున్నాము. రాజకీయవేత్తలు రాజనీతిని విడనాడుటకంటె అవివేకము మరొక్కటి [illegible] చేయుచున్నాము. [illegible] టౌన్‌నుండి కమ్యూనిస్టులను వెడలగొట్టిన పద్ధతి [illegible] భంగమై [illegible] గా [illegible] అతివాదులను కాం[illegible] వెడలు[illegible] జరుగు[illegible] స్వాతం[illegible] బలహీనపరచక [illegible] సూచించుచున్నాము. [illegible] కార్యకౌశల్యమే [illegible] రాష్ట్రాధికారులు [illegible]న్నాము. ఏ జిల్లాలో [illegible] పత్రికలు "[illegible]" [illegible] కొల్పినారని నేర[illegible] బడినదో ఆజిల్లాలోనే [illegible] కాంగ్రెసు అధ్య[illegible] దర్శులు ఒకచోట సమా[illegible] యైన విచారణ జరగలేదని ఆక్షేపించినప్పుడు పట్టాభిప్రభృతులు [illegible] తమచర్య మరద్దుపరచు [illegible] వివేకమనిపించుకొనును. [illegible] శిక్షలకుగురైన వారే [illegible] ప్రజానాయకులు [illegible] పరిగణింపబడుచుండిరి. ఇప్పుడు రాష్ట్రకాంగ్రెసు సం[illegible]కారులచే శిక్షింపబడిన యీ [illegible] బహిరంగముగా సన్మా[illegible] జరుగుచుంటలు జూడ [illegible]యుల దోషమును ప్రజలు నిర్ణయిన్నారని యర్థము. ఇంకను ఆందోళన, అలజడి ప్రజలలో హెచ్చుకాకమునుపే పట్టాభి ప్రభృతులు మెల్లాంచి ప్రతిష్ఠను పాటింపక కాంగ్రెసు క్షేమమును దేశక్షేమము గమనించి ధైర్యంగా తమ చర్యలను రద్దుపరచుకొందురుగాక యని కోరుచున్నాము. అసమ్మతిని దెల్పునది రాష్ట్రకాంగ్రెసు వర్కింగుకమిటీయొక్క యీ అనవసర చర్యవల్లనేగాని కాంగ్రెసు సంస్థపైగాదని ప్రజలు గమనించి ఆంక్షలవల్ల నిగ్రహముచు గోల్పోవక కఠిన పదముల ప్రయోగింపక అసమ్మతిని తెల్పుటతోడను శిక్షలను రద్దుచేయుడని కోరుటతోను మాత్రమే తృప్తి నొందవలయునని యువకులను హెచ్చరించుచున్నాము. యువక నాయకులపై నిట్టి ఆంక్షలు వెలువడినను వాటిని లక్ష్యపెట్టక కాంగ్రెసు సేవను రెట్టించిన ఉత్సాహంతో చేయవలెనని కోరుచున్నాము.

## నేటిప్రపంచం

( 9 వ పేజీ తరువాయి )

నాయి. 100 బాంబులు వేసినవి. మొదటిసారి.

3 సార్లు బాంబుల వర్షంవల్ల మొత్తం 1100 మంది చనిపోయారని 1600 మంది గాయపడ్డారని తెలుస్తుంది. బ్రిటిష్ మతాధికారులు, అమెరికావారు, తమతమ ప్రభుత్వాలు అసమ్మతి తెలుపవలసిందంటూ కోరారు.

ఈ జపాన్ రాక్షస కృత్యాలను అందరూ గర్హిస్తున్నారు. తమకు దోచిన సహాయమూగావించుతున్నారు. మలయాలోని హిందూదేశస్థులు ఒక 'అంబులెన్సు' పంపారు. మనదేశం నుండి కూడా వైద్యసహాయం, ధనసహాయం పరిపాలనితలచాను. వీలునాఉండే జపాను తన దాడి ప్రారంభించిన మొదటి దినం జూలై 7వ తేదీన పంపాలని సుభాస్‌బాబు అభిప్రాయపడ్డారు. నెహ్రూ కూడ విరివిగా సహాయంచేయాలంటూ ఒక విజ్ఞప్తిగావించారు. జూన్ 12 వ తేదీ చైనాదినంగా పరిగణించి భారతీయులు సుభాస్ విజ్ఞప్తి ననుసరించి ధనమూ, వైద్యసామగ్రీ పంపి తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలి.

జపాను రాజకీయాలలో మార్పులు వచ్చాయి. హిరోటా, విదేశరాజ్యాంగ మంత్రి, రాజీనామా ఇచ్చాడు. యుద్ధ మంత్రికూడా రాజీనామా నిచ్చాడు. 1936 లో సైనికులు తమ నాయకునిగా అంగీకరించని జనరల్ 'యుగాకీ' విదేశ మంత్రి అవుతున్నాడు.

బహుశా జపాన్‌కు రోజురోజూ కలిగే అపజయాలు, దేశంలోఅసంతృప్తి

ఈ మార్పులకు కారణంగావచ్చు. ఇకెడా అను ఆయన నూతన మంత్రివర్గానికి. ఫేసిస్టుధోరణి ఏమిలేదని చెప్పినా నమ్మ గూడదు. ఇదివరకున్న మిలటరీ ఫేసిజం తన నగ్నస్వరూపంతో జపాన్‌లో క్లిష్ట దశలు సంభవిస్తే బయటపడవచ్చు.

1936 మే లోను తర్వాతను అరెస్టు చేయబడిన 1500 మంది అనుమానింపబడిన కమ్యూనిస్టులలో 235 మంది ఇపుడు రహస్యంగా విచారింపబడుచున్నారట. ఇదివరకు ఈ వార్తలనే ప్రకటించరాదన్న నిషేధం ఇపుడు తొలగింపబడింది.

ఫేసిస్టుపాలనలో కమ్యూనిస్టులకు ప్రాణరక్షణకి తావెక్కడిది ?

**మహాయుద్ధం తప్పింపబడినదా ?**

జకోస్లొవేకియా పరిస్థితులు కొంచెం చల్లబడ్డాయి. డాక్టర్ హోడ్జా హెన్లీన్ సంభాషణల ఫలితం ఏమిటో తేలలేదు. ఎన్నికలుకూడా ప్రశాంతంగానే జరిగాయి. జర్మనులు హెన్లీన్‌కే ఎక్కువ ఓట్లు ఇచ్చారు. సోషల్ డెమోక్రేట్లు విపరీతంగా ఓడిపోయారు. తక్కిన చోట్ల 'కామన్‌ఫ్రంటు' పార్టీయే ఎక్కువగా గెలిచింది.

అయితే రోజురోజూ సరిహద్దులలో ఏదోఘటన జరగడం, జర్మనీ అసమ్మతి తెల్పడం సాగించింది. అలాంటి ఘటనలకు, జకోస్లొవేకియా ఎంత బాధ్యురాలో జర్మనీకూడా అంతే బాధ్యురాలని జక్ ప్రభుత్వం ప్రకటించింది. గోబెల్సు జక్ ప్రభుత్వాన్ని బెదిరించాడు. 700 లక్షల ప్రజలున్నారని, ఆయుధబలమే తమ బలమని తెల్పాడు.

ఈ అసమ్మతులు, రంకెలు, ఎప్పటికైనా ఈ పొగరాజి, అగ్నిపర్వతంలా భగ్గుమనక తప్పదని తెలుస్తుంది. తాత్కాలికంగా ప్రపంచయుద్ధం తప్పించినదని బ్రిటన్ చంకలు కొట్టుకుంటున్నది. కొందరు నిజమేనని భ్రమపడుతున్నారు. కాని నిజానికి హిట్లర్‌కు ఇంత ధైర్యం ఇచ్చింది బ్రిటనే. ఇదివరకే ఆస్ట్రియా ఆక్రమణంలో ధైర్యంగా నిలబడితే....

ఇటలీతో ఒడంబడికచేసుకొని బ్రిటన్ ఫాసిస్టులవైపుకు మ్రొగ్గింది. తాను అబిసీనియాకి ద్రోహంచేసినట్లు ఫ్రాంసును స్పెయినుకు ద్రోహంచేసి తమ ముఠాలో కలవమని బ్రిటన్ ప్రోత్సహిస్తున్నది. అలా ఫ్రాంసును విడదీసి సోవియట్ ఫ్రాంసుల ఒడంబడికను భగ్నంచేయాలని ప్రయత్నించింది. కాని ఆలాజరుగలేదు. జకోస్లొవేకియా విషయమై రష్యా తన ప్రతిజ్ఞ మానలేదు. ఫ్రాంసులోని ఫాసిస్టు వ్యతిరేకశక్తులో ఫ్రాంసు ఇలా లొంగిపోకుండా కాపాడినవి. బ్రిటన్ కోరిక నెరవేరలేదు. ఇలాంటి ద్రోహాన్ని తలపెట్టే బ్రిటన్‌కు జేజేలా ....

## నవశక్తి కార్యాలయం మార్పు.

'నవశక్తి' కార్యాలయాన్ని బెజవాడకు మార్చాలని నిశ్చయించేశాము. రాజమంత్రి నుండి వెలువడే సంచిక యిదే ఆఖరిదని మనవిచేస్తున్నాం. ఈ నెల 8 వ తేదీని మాత్రము సంచికను ప్రకటింప జాలము. బెజవాడ నుండి మొదటి సంచిక యీ నెల 15వ తేదీని వెలివడుతుంది. కార్యాలయం మార్పుకు సంబంధించిన యేర్పాట్లు మమునా కొనసాగించుకొనుటకు మధ్య నొక వారం మాత్రం సెలవు తీసికొంటున్నాము.

అయినెలలు పాటు రాజమంత్రి నుండి పత్రికను నడిపి యిప్పుడు ఆకస్మికంగా బెజవాడకు మార్చుటకు కారణమేమి యని చందాదారులు, పాఠకులు, అనుకోవచ్చును. నవశక్తి జిల్లాపత్రిక కాదు. ఆంధ్రరాష్ట్రానికంతకు సంబంధించిన పత్రిక. అందుచే ఆంధ్రదేశానికి మధ్యస్థానమైన బెజవాడనుండి "నవశక్తి" ని ప్రచురించుట కెక్కువ సౌకర్యము గానుండునని మా నమ్మకము. ఇదే మార్పునకు ముఖ్యకారణము.

"నవశక్తి" యింతవరకు స్వంత ముద్రణాలయంలేక "పరులపంచ" ను కాలక్షేపం చేయవలసివచ్చింది. అయినా రాజమంత్రి శ్రీనివాసప్రెస్సువారు శ్రద్ధ వహించి దీనిని అందంగా అచ్చొత్తించుటకు తోడ్పడినందుకు వారికి వందనా లర్పించుచున్నాము. నవశక్తి యిప్పుడు స్వంతముద్రణాలయం సంపాదింప గల్గిందని చెప్పుటకు సంతోషించుచున్నాము. 15వ తేదీనుండి "నవశక్తి" విజయవాడ నుండి స్వంతముద్రణాలయము నుండి సర్వాంగశోభితంగా వెలువడునని మనవి చేస్తున్నాం. ఆంధ్రమహాజనులు ఇంతవరకు "నవశక్తి" కి చూపిన ఆదరణకు కృతజ్ఞులము. కాని అది యేమాత్రము చాలదు. ఆంధ్రదేశమున అన్ని గ్రామాలను "నవశక్తి" అలంకరింపవలెనని మా ఆశయము. 16 పేజీలతో నారంభించి 20 పుటలకు పత్రికను తీసుకొని రాగల్గితిమి. 24 పుటలకు హెచ్చింపవలయునని ఆలోచించుచున్నాము. ప్రజల ప్రోత్సాహంతో త్వరలో మా ఆశలు నెరవేరునని తలంచుచున్నాం.

జన్మస్థానమగు గోదావరి మండలమును వీడి, ఇరువదేండ్ల చిరుత ప్రాయమునుండి కార్యరంగమైన రాజమండ్రినుండి వెడలిపోవలసిన అవసరము గల్గినందుకు నవశక్తి సంపాదకుడెంత పరితాపమును బొందుచున్నాడో వ్రాయ నలవికాదు. కాని స్వధర్మము ముందర సకల పరితాపములును నమసి పోవలెను కదా ! గోదావరిమండల ప్రజలకు, రాజమంత్రినగర ప్రజలకు వలయునంత సేవచేయలేకపోయెనను కింపతో, అందులకు హృదయపూర్వక క్షమాపణతో సంపాదకుడు రాజమంత్రిని వీడఅనుజ్ఞను వేడుచున్నాడు. మనఃపూర్వకముగ మన్నింపుడని కోరుచు శలవు గైకొనుచున్నాడు.



# మద్రాసు రాష్ట్రంలో పౌరస్వాత్వ హక్కులు

## 1. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలి

## 2. విడుదల చేయాలసిన రాజకీయ ఖైదీలు

ప్రేమ ప్రకాశ్, హజారాసింగ్, ఖుశీరాం, శంభునాచ్, బచ్చులాల్.
(ఊటీ బ్యాంకు, మద్రాసు బాంబు కేసు ఖైదీలు.)

శ్రీహరిదాసు, అతని సహచరులు. (సన్యంలో పనిచేశారు)

## 3. నిషేధము తొలగించాలసిన పుస్తకాలు

సామ్రాజ్యవాదము, కమ్యూనిస్టు కరపత్రము, కారల్ మార్క్సు ఉపదేశములు, 1905 రష్యను విప్లవము, వినాయక సావర్కారు జీవితము, రాజనీతిసారము, నీతిమంజరి.

## 4. రద్దు చేయాలసిన నిర్బంధ చట్టాలు

ప్రెస్సు ఆక్టు, క్రిమినల్ లా అమెండుమెంటు ఆక్టు, 124. A. సెక్షను, 108 సెక్షను, 144, 144 కమ్యూనల్ తగాదాలకే వర్తింప జేయాలి.

## 5. క్రొత్తపట్టణముపై నిషేధము తొలగించాలి

## 6. పోలీసు అధికారాలను అరికట్టాలి

సభలలో సి. ఐ. డి. పోలీసు మానివేయాలి. పోలీసులు ప్రజాసేవకుల వెంటాడడము ఆపివేయాలి.

రా జా జీ

జమీగొల్వేపల్లి (కృష్ణా) గ్రామకాంగ్రెసు సంఘమువారీ తీర్మానాలగావించారు. (20—5—38).

1. భారత కమ్యూనిస్టు పార్టీపై నిషేధము పౌరస్వత్వహక్కులకు భంగము కల్గించుచున్నది గాన వెంటనే నిషేధము తొలగించవలెనని ప్రభుత్వము వారిని ఈసభవారు కోరుచున్నారు.

(2) రాచకీయ నిర్బంధితులను విడుదల చేయుచున్న ప్రభుత్వమును అభినందించుచూ, మిగిలిన వారిని కూడ విడుదల చేయవలెనని ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

(3) రష్యావిప్లవము నిషేధించినందులకు అసమ్మతి తెల్పుచూ పుస్తకములపై నిషేధం తొలగించవలెనని ఈసభవారు కోరుచున్నారు.

*

నిడదవోలు గ్రామయువజన సంఘంవారు (21—5—38) శ్రీచంద్రారెడ్డి గ్రంథాలయమందు సమావేశమైఈదిగువ తీర్మానం గావించారు.

"మద్రాసు గవర్నమెంటువారు ఇంతకు పూర్వము నిషేధించబడిన పుస్తకములపై పూర్తిగా నిషేధము తొలగించక పోవుటయేగాక "1905 రష్యావిప్లవం"ను నిషేధించినందులకు ఈసభవారు కాంగ్రెసు మంత్రివర్గమువారి చర్యను పూర్తిగా నిరసించుచున్నారు."

## కార్మిక సమస్యలు

[ 8 వ పేజీ తరువాయి ]

[1] ప్రావిడెంటు ఫండు నేడు. [2] చాల కార్మికులను నిరుద్యోగులు చేసే (Piecework)కంట్రాక్టు పద్ధతుని తీసివేయలేదు.

**రాణిగంజ్**

రాణిగంజ్ [బెంగాలు] లో బరన్ అండుకో వారి ఉక్కుఫాక్టరీలో యిప్పటికి నెల రోజులనుండి 1500 కార్మికులు సమ్మె జేస్తున్నారు. 4 గురు పనివార్లను అకారణంగా పనిలోంచి తొలగించడమే సమ్మెకు కారణం. కలకత్తా లేబర్ కమీషనరువచ్చి సమ్మె మానవలసినదిగా కోరాడు. సమ్మెజేసిన రోజులకు కూడా జీతాలిస్తే పనిలోకి వస్తామన్నారు.

**తిరువత్తూరు**

తిరువత్తూరు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో 750 కార్మికులు 18 రోజులనుండి సమ్మె జేస్తున్నారు. యజమాన్లు కొత్త పనివారిని రప్పించుకుంటున్నారని. యిటువంటి పనులు సాగిస్తే తీవ్రమైన పికెటింగు సాగిస్తామని యజమానులను హెచ్చరించారు. లేబర్ కమీషనరుకు పరిస్థితులన్నీ తెలియపర్చారు. బొంబాయి అంబర్‌నాథ్ లోనున్న యీ ఫ్యాక్టరీ బ్రాంచినుండి కార్మికు లిచ్చటికిరాకుండా రాయబారం పంప నిశ్చయించారు.

**మద్రాస్**

మద్రాస్ ట్రాంవే కార్మిక వివాద విచారణ కర్తగా నియమింపబడిన జస్టిస్ పాండురంగారావుగారు తీర్పులో, కార్మికుల దేమీతప్పులేదని, మరల వారిని పనిలో చేర్చుకోవాలనివ్రాశారు. ఆ ప్రకారం పనిలోంచి తొలగింపబడిన 5 గురిని జేర్చుకున్నారు.

*

మద్రాసు జమాల్‌గాజు ఫ్యాక్టరీలో ఈ నెల 12 వ తేదీనుండి సమ్మెసాగుతోంది. ఇద్దరు కార్మికులు అరెస్టుచేయబడ్డారు. తరువాత బెయిలుమీద విడుదల పొందారు.

*

ఈ నెల 28 వ తేదీని మద్రాసులో, అల్యూమినం ఫ్యాక్టరీ కార్మికులు, కిరసనాయిలు పనివారలు, అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ కార్మికులు తమ సంయుక్త సమావేశంలో, చాలచోట్ల మిల్లు యజమాన్లు కార్మికులను చట్టసమ్మతమైన ట్రేడ్ యూనియన్ పని కూడా చేయనీయక అరికట్టుచున్నారని అందుచేతనే తగాదాలు సమ్మెలువస్తున్నాయని కాంగ్రెసు ప్రభుత్వం వెంటనే కలుగజేసుకుని కార్మికులకు రక్షణనిచ్చేచట్టం తేవలెననీ కోరారు.

**చిట్టివలస**

ది 29—4—38 ని ప్రారంభమైన చిట్టివలస జ్యూటు మిల్లుసమ్మెయింకా సాగుతూనే వుంది. వారికోర్కెలన్నీ అంగీకరింప బడేవరకూ సమ్మెసాగిస్తారని తెలుస్తోంది.

**చీరాల**

చీరాల పొగాకు కంపెనీవారి అక్రమ చర్యలు నానాటికి శృతిమించి పోతున్నాయి. కార్మికసంఘంలో సభ్యులుగానున్న వారిని తమ సభ్యత్వాలకు రాజీనామా ఇవ్వవలసినదని, లేకపోతే పనిలోంచి తొలగిస్తామని బెదరిస్తున్నారు. అంచాలిమ్మని బాధిస్తున్నారు. దీనికంతకి ఇంజనీరింగు శాఖాధికారి ఫెలిక్సుగారు కారణమట. ఆయనచేసే దానికి యజమానులు దోహదమిస్తున్నారు. ఈ విషయాలన్నీ కార్మిక సంఘ కార్యదర్శి మద్రాసు ప్రభుత్వానికి, జిల్లాకలెక్టరు గారికి కూడా వ్రాశారు. ఎవ్వరూ జోక్యం కలుగ జేసుకోడంలేదు. యీ విషయమై కార్మికసంఘ కార్యనిర్వాహకవర్గంవారు మద్రాసుకు రాయబారం పంప నిశ్చయించారు.

చీరాల కాల్పుల విషయమై మద్రాసు ప్రభుత్వ ప్రకటనగురించి ఆలిండియా కాంగ్రెసుకమిటీలో చర్చకు వచ్చిందనీ, వల్లభాయిగారి నీవిషయం పరిశీలించుటకు నియమించారనీ పట్టాభిగారు ప్రకటించుచున్నారు.

**పూనా.**

పూనావద్ద సఖర్‌వాదా పంచదార ఫ్యాక్టరీలో ప్రేలుడు ప్రమాదంవల్ల 19 కార్మికులు మరణించారు. 11 రు గాయపడ్డారు.

**బర్మా.**

బర్మాలో హంజాడాలో 200 రిక్షా లాగే కూలీలు సమ్మె జేస్తున్నారు.

**మైసూరు**

మైసూరువద్ద గని ప్రమాదంవల్ల, గనిలో పనిచేసే నలుగురు కార్మికులు మరణించారు.

**మధుర.**

మధుర రాజా మిల్లులోని కార్మికుల కోర్కెలు యజమాన్లు అంగీకరించడం వల్ల సమ్మె అంతమైంది.

**చూలై.**

చూలై మిల్లు తగాదావిషయంలో మద్రాసు ప్రభుత్వం నియమించిన కన్సిలియేషన్ బోర్డువారి రిపోర్టు కార్మికులకు అసంతృప్తి కలిగించింది. 1932 అనంతరం కార్మికులకు జీతాలు క్రమక్రమంగా తగ్గించబడుచున్న విషయం, అప్పటినుంచీ నేటివరకు ఆ విషయమై కార్మికులు గావిస్తున్న ఆందోళన, ఈవిషయాలు ఆ రిపోర్టులో తలపెట్టనే లేదు.

# బాబా జ్వాలాసింగు

## 'కామగాటమారూ' విప్లవకారుడు

## లారీ ప్రమాదం వల్ల చనిపోయాడు

పంజాబ్ కిసాన్‌కమిటీ అధ్యక్షుడు బాబాజ్వాలాసింగు మే 9 వ తేదీన మరణించాడు. 6 వ తేదీన ఒకారా నుండి వస్తుండగా లారీప్రమాదము తటస్థించింది. మేయో హాస్పిటల్‌లో చనిపోయాడు.

10 వ తేదీన సాయంత్రం శవాన్ని అమృతసర్ తీసుకవెళ్ళారు. పెద్ద వూరేగింపు జరిగింది. సోషలిస్టులు, కమ్యూనిస్టులు, అకాలీలు, కాంగ్రెసువారూ అందరూ పాల్గొన్నారు. అంత్యక్రియలు జరిపేటపుడు సర్దార్ సోహన్‌సింగ్‌జోష్, యం.యల్.ఏ., మున్షీ అహమ్మద్ దీన్, బాబా షేర్‌సింగ్ మొదలగు వారనేకమంది, జ్వాలాసింగ్ దేశసేవను, త్యాగనిరతిని, విప్లవ జీవితాన్ని కొనియాడారు.

జీ వి త ం.

1860—70 సంవత్సరాల మధ్య జననం. రైతు కుటుంబంలో పుట్టాడు. రైతులుపడే కష్టాలు అనుభవించలేక మంచి జీవనం గడపాలని దేశాంతర గతుడయ్యాడు. అమెరికాలో వ్యవసాయం పెట్టాడు. బాగా డబ్బు గడించాడు. "పొటాటో కింగ్" (బంగాళాదుంపల రాజు) అనే పేరు గడించాడు.

ఇంతలో ఒక విప్లవ తరంగం లేచింది. గదర్ పార్టీ స్థాపించబడింది. తమ మాతృ దేశం కోసం తమ సర్వస్వాన్నీ అర్పించాలనీ, తమకేమీ ఉండరాదనీ ప్రతిజ్ఞ చేశారు. ఈ విషయాన్ని గురించే బాబా ఒకసారి ఇలా సెలవిచ్చాడు. "ఏమైనాసరే– ఏవిధంగానైనా సరే–మన దేశానికి స్వాతంత్రం తేవాలి అని మేము నిశ్చయించుకొన్నాం." ఈ ఆత్మ బలిదాన భావాలతోనే 'కామగాటమారూ" నౌక అమెరికానుండి బయలుదేరింది. తర్వాత బడ్జిబడ్జి ఘటన సంభవించింది: వందలకొలది ప్రాణాలు పోయినయి. చాలమంది జైళ్ళ పాలయ్యారు.

గదర్ (లాహోరు) కుట్రకేసులో (1914—1915) లో జ్వాలాసింగు ఇతర అనుచరులతోపాటు శిక్షింపబడ్డాడు. రాజుగారి మీద యుద్ధం ప్రకటించాడనే నేరానికి యావజ్జీవ శిక్ష విధించింది బ్రిటిష్ ప్రభుత్వం.

18 ఏండ్ల జైళ్ళ నరకం అనుభవించాక జ్వాలాసింగు 1933 లో విడుదల అయాడు.

అండమానుల జీవితంతో అతని తల నెరిసింది. కాని అతని విప్లవజ్వాల చల్లారలేదు. అతడు ప్రేమించిన సోదర భారతీయుల సేవలో నిమగ్నుడయాడు రైతు సంఘాలలో పనిచేయ ప్రారంభించాడు. తన కామ్రేడ్స్‌తో కలిసి గ్రామ గ్రామాన తిరిగాడు. నిస్పృహా–నైరాశ్యంలోపడి కొట్టుకులాడే దీన రైతుల్లో ఒక నూతన జీవం పోశాడు. ఒక కదలిక కదిలించాడు. సోషలిస్టు సిద్ధాంతాల బోధించాడు. గత సంవత్సరం సెప్టెంబరులో ఒక సంవత్సరంలో 1 లక్షమంది కిసాన్ సభ్యులను చేర్పించాలని నిశ్చయయింది. ఎవరెవరికెన్ని దరఖాస్తు ఫారాలు కావాలో నని అడిగారు. "25 వేలు నాకు కావాలి" అంటూ ఒక కంఠం పల్కింది. అది జ్వాలాసింగే. అక్కడ ఉన్న రైతు సేవకులలో జ్వాలాసింగు ఉత్సాహాన్ని రేకెత్తించాడు. కొన్ని మాసాలకే 75 వేల మంది రైతు సంఘాలలో చేరారు.

రాత్రిం బగళ్లు బాబా రైతుసంఘాలు వృద్ధిపొందటానికి కృషిచేశాడు. లారీ వల్ల అంత పెద్దదెబ్బ తగిలినా 'నిల్లిబార్' అనే గ్రామానికి వెనక్కి బయలు దేరాడు. అక్కడ 40 వేలమంది రైతుల యాత్ర జరిపాడు. వారి కోర్కెలు తీర్పబడినాయి కూడాను.

చివరకు చనిపోయే సమయానకూడా అతని మనసు బంధువులపైపుకు మరలలేదు. మిత్రులపైపుకూ మరలలేదు. 'కిసాన్-కిసాన్' అంటూనే పలవరించాడు. శ్రీమతి బీబీ రఘుబీరకార్ యం. యల్. ఏ ఇలా అడిగింది. "బాబాజీ! మీరు చనిపోయే ముందే కార్మికకర్షక రాజ్యం చూస్తానని ప్రతిజ్ఞ పట్టారు. కాని అప్పుడే మమ్మల్ని వదలిపెట్టి తున్నారు." బాబా ఇలా సమాధానం ఇచ్చాడు. "నా యీభౌతిక శరీరం రైతులను విడిచిపెట్టినా, నా కోరిక రైతులను విడిచిపెట్టుతుందని తలుస్తావా? కార్మిక కర్షక రాజ్య స్థాపనకై– స్వాతంత్ర్య సంపాదనకై– రాత్రింబవళ్ళు నిద్రాహారాలు మాని పనిచేయండి. ఇదే నాకోరిక. పోతున్నాను." అని, కనులు మూసాడు. ఆ కన్నులు మళ్ళా తెరవ లేదు. బాబా జ్వాలాసింగు ఇక మనకు లేడు. ఒక విప్లవమూర్తి— ఒక రైతు సేవకుడు. ఒక స్వాతంత్ర్య పిపాసి— మనకు లేకుండా అస్తమించాడు.

# డిసిప్లినరీ చర్యకు

## గారపాటివారి సమాధానం.

శ్రీయుత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులవారికి

బందరు.

ఆర్యా!

మాజిల్లాలో హరిపురకాంగ్రెసు ప్రతినిధుల ఎన్నికలు జరుగు సమయమున నేను జిల్లాకాంగ్రెసు సంఘ కార్యదర్శినై యుంటిని. మాజిల్లా సంఘాధ్యక్షునిచే ఎన్నికోద్యోగిగా నియమింప బడితిని. నేను ఎన్నికోద్యోగిగా నుండి, మా జిల్లా సంఘాధ్యక్షుని సాయంతో జిల్లాలో ప్రతిచోటను చాల సక్రమముగాను, శాంతియుతముగాను, పేచీలు లేకుండగను, అన్యాయములు జరుగకుండగను, చాల జాగ్రత్తగా ఎన్నికల కార్యకమము జరిపించి యుంటినని తమకు తెలిసిన విషయమే. కాని రాష్ట్రమంతను ఎన్నికల కార్యక్రమము తీవ్రముగా నున్నప్పుడు, ప్రతిచోటను తీవ్రముగా పోటీలు జరుగుచున్నప్పుడు, తమ స్వంతజిల్లా తూర్పుకృష్ణాలోనే అనేక అన్యాయములు జరుగుచున్నవని అసంతృప్తి ప్రబలియున్నప్పుడు కాంగ్రెసు యొక్క మూల సూత్రములకు గాని, గౌరవ, ప్రతిష్ఠలకుగాని భంగము కలుగకుండా చేయవలెనంటే ఎన్నికల విధానము, నిబంధనలు, వివరములలో అన్ని జిల్లాల ఎన్నికోద్యోగీయులకు "ఇన్‌స్ట్రక్షన్సు" యిచ్చియుండవలసినవిధి రాష్ట్ర సంఘముపై యున్నది.

ఏవిధంగాను సరియైన సూచనలు రాష్ట్రసంఘము యివ్వనప్పుడు, ఎన్నికోద్యోగీయులు తమకు తోచిన విధమున, అశాస్త్రముగాని, అక్రమముగాని అన్యాయముగాని, కానిరీతిని ఎన్నికలు జరిపించుటలో రాష్ట్రసంఘమువారి ఆజ్ఞలను అతిక్రమించా రనుట న్యాయముకాదు.

1. మొగల్తుర్రు ఎన్నిక వర్గములో తూర్పుతాళ్ళు, పేరుపాలెం పోలింగులలో అసలే ఎన్నికలు జరుగలేదని ఆ పోలింగులలోని ఓటర్లందరూ కలిసి రిపోర్టు పంపుటచేతను, పోలింగు ఆఫీసర్లుకూడా ఓటర్లు ఎవ్వరూవచ్చి పోలు చేయలేదని రిపోర్టు పంపుటవల్లను, అందుననూ ఆ నియోజకవర్గములో పోటీ చేయుచున్న యిరువురు అభ్యర్థుల ఆమోదంపై తిరిగి ఎన్నికలు జరుపుట, రాష్ట్ర సంఘమువారి ఆజ్ఞలను అతిక్రమించుట కాదని మనవిచేయుచున్నాను.

2. పెనుమంత్ర ఫిర్కాలో కూడ ఎన్నికోద్యోగి స్వయముగా పోయి కొమ్మర, పాలూరు, పోలింగులలోని ఎన్నికల విధానముచూచి సరిగా జరుగుటలేదని నమ్ముటచేతను, సదరు నియోజకవర్గమునగల మిగతా పోలింగులలో జరిగిన ఎన్నికలు కేవలం నీతికివిరుద్ధంగా, కాంగ్రెసు మూల సిద్ధాంతాలకే భంగంకలిగించే విధానాలతో జరిగినవనియు, ఓట్లను డబ్బుపెట్టి కొన్నట్లును ఆ తాలూకాకాంగ్రెసుకార్యదర్శి వగైరాలు ఎన్నికనురద్దుచేసిమరల ఎన్నికలు జరిపించుట న్యాయమనీ, కాంగ్రెసు సూత్రము ఆ ఎన్నిలకు విరుద్ధంగాప్రవర్తించిన అభ్యర్థిపై తగిన చర్య తీసుకొనవలసినదనీ, ప్రాతమూలమున తెలుపుటచేతను, మొత్తం ఎన్నికవర్గమునకు తిరిగి ఎన్నికలు జరుపబడునని పత్రికాముఖమున ప్రకటించుటలో తప్పేమిగలదో తెలియకున్నది.

3. పైవిషయమున నిలుపుదలచేసిన రెండుపోలింగుల ఎన్నికలు జరుగువరకు మిగతాపోలింగుల సంచులు భద్రపరచి, మిగిలిన రెండుపోలింగుల బ్యాలటు సంచులువచ్చిన పిమ్మట మొత్తముగా కలిపి లెక్కించి జయాపజయములు నిర్ణయించునని 30—12—38 తేదీన రాష్ట్రసంఘము వారు ఎన్నికోద్యోగి గారికి వ్రాసినామన్న కాగితము సకాలములో మాకు చేరక రెండు మూడురోజులు జరిగిన పిమ్మట చేరుటయు, యీవిషయమున మిగతా సంచులు ప్రత్యేక సీళ్లువేసి, తమవద్ద భద్రపర్చవలసిన దని రాష్ట్రసంఘము వారు వ్రాసిరని డాక్టరు రంగయ్యగారు కోరినప్పుడు, రాష్ట్రసంఘమువారి నుండి ఎట్టివర్తమానము ఎన్నికోద్యోగిగారికి వచ్చి యుండలేదనియు, వచ్చిన ఎడల సీళ్లకు సంచులు యిచ్చుటకు ఎట్టి అభ్యంతరము వుండదని వ్రాసియిచ్చుట నిజమే అయినప్పటికీ, ఎన్నికోద్యోగి తనకుమని తోచినప్పుడు, ఫిర్కాలో ఏవిధమైన అసంతృప్తికలుగనప్పుడు, ముఖ్యముగా ఆ నియోజకవర్గములోని అభ్యర్థు అందరూ తిరిగి ఎన్నికలు జరిపించుటకు ఒప్పుకొంటున్నప్పుడు, లోగడ జరిగిన ఎన్నికలు రద్దుపరచి మరల ఎన్నికలు ప్రకటించి యున్నప్పుడు, వెనుకజరిగిన పోలింగుల తాలూకు బ్యాలటు సంచులు పగులగొట్టబడుట ఏమాత్రం న్యాయశాస్త్రవిరుద్ధము కాదని నమ్ముచుంటిని.

4—1—38 తేదీన తణుకులో రాష్ట్ర సంఘాధ్యక్షులను ఎన్నికోద్యోగిగారు కలుసుకొన్నప్పుడు బ్యాలటు కాగితములు ఏమిచేసిరని అడిగినప్పుడు వాటిని తీసి Destroy చేసితి ననిచెప్పినట్లు తమ ఆఫీసునుండివచ్చిన చిందారోపణలలో

( మిగతా 17 వ పేజీలో )



( 6 వ పేజీ తరువాయి )

7. రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో ఈ విషయము ప్రతిపాదించిన దెవరు? అనుకూలు రెంతమంది? ప్రతికూలు రెంతమంది ?

8. తీర్పులో పేర్కొనబడిన నేరములలో ఏవైనా ముందుగా ఎన్నికల విచారణ సంఘముచే విచారింపబడి రుజువు పర్చబడినవా? లేనియెడల ఆ విచారణ కమిటీవారు జరుపు తంతును వక్కింగు కమిటీయే ఏమైనా జర్పిందా ?

9. ఫిర్యాదులకు, నేరస్థులను పూర్వ సంబంధ మెట్టిది ?

10. మీరున్నూ, మరి కొంత మంది కిని శ్రీ అల్లూరి సత్యనారాయణ గారిపై గల ఈర్ష్య, సోషలిస్టులపై గల క్రోధము కారణంగా గాని, ఏవో విధంగా వారిని సాధించుకొనుటకై ఇట్టి నేరములను మోపి, సక్రమ మగు పౌరసత్వపు హక్కును బహిరంగ విచారణ జరుపకుండానే అక్రమపు తీర్పు ఇచ్చి, మీకు గల అధికారమును దుర్వినియోగపర్చు కొన్నటుల నేను, నాతో బాటు అసంఖ్యాకులగు కాంగ్రెసువాదులు తలచుచున్నాము. కాన

A. మీ తీర్పు అధికార దుర్వినియోగం కాదంటారా ?

B. బహిరంగ విచారణ జరిపి నేరమును రుజువుపర్చగలరా ?

వెల్లంకి విశ్వేశ్వరరావు
ప్రధాన కార్యదర్శి,
కృ. జి. కాం. సో. పార్టీ
&
కలవపాముల 19—5—'38 } ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యుడు.

# రైతు సంఘాల నిరసనము

## "ఇది అక్రమము"

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు నిర్వాహక వర్గము వారి నిర్ణయము విచారము కల్గించుచున్నది. అల్లూరి సత్యం, మొదలగు వారు యెల్లప్పుడూ, కాంగ్రెసు సేవకులుగా యుండియే గాక,రైతుసేవకులుగా యుండి, యెల్లెడల రైతు సంఘాలను స్థాపించి, తద్వారా రైతు శ్రేయమునకు కృషి చేయుచున్న వీరిని, కాంగ్రెసు సంఘముల నుండి తొలగించుటకు, రాష్ట్ర కాంగ్రెసు వారు చేసిన నిర్ణయము, ఒక కాంగ్రెసునకే గాక, రైతు లోకమునకు కూడా, తీరని నష్టమని తెల్పుటకు సందేహము లేదు. వీరిపై, ఆరోపింపబడిన, నేరములు కాంగ్రెసుకు వ్యతిరేకముగా ప్రవర్తించిరని గానీ, కాంగ్రెసుకు ద్రోహ మొనర్చిరని గానీ లేదు. ఎవరో కొందరి వ్యక్తులకు మధ్య నుండు పరస్పర సంభాషణలకు ఫలితముగా, వీరిపై డిసిప్లినరీ చర్య, తీసికొనబడుట అసమంజసముగా యున్నది. సాధారణముగా, కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రవర్తించుట గానీ, కాంగ్రెసు నియమించిన అభ్యర్థులను, యెదిరించుట వగైరా, కాంగ్రెసు ప్రతిష్టను తగ్గించు పనులు చేసినప్పుడే జరుగవలెను గాని, కాంగ్రెసులోని,ఒకరి కొకరి కుండు పరస్పర అభిప్రాయ భేదములకు, రాజకీయ భేదాభిప్రాయములకు ఫలితంగా అధికారములో నుండు వారు, అధికారేతరులను అణచి వేయుటకు, యీ విధంగా ప్రవర్తించుట, స్వాతంత్ర్య సమరమును నన్నగిల చేసినవారగుదురు.

కాన, రాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు కార్య నిర్వాహక వర్గము వారు చేసిన, యీ నిర్ణయములపై,మరల మాలోచించి, ఆంధ్ర దేశములో, కాంగ్రెసు గౌరవమును కాపాడు బాధ్యత, తమపై నున్నదని యెరింగి, అల్లూరి సత్యం ప్రభృతులపై యున్న, యీ ఆంక్షను తొలగించాలని కోరుచున్నాను.

ఇట్లు, రాష్ట్ర సంఘము వారు చేయువరకూ, రైతు సంఘము లన్నియూ, రైతు సేవకు లగు వీరిని యథార్థ స్థితికి తెచ్చుటకు గాను, తీవ్రాందోళనము సల్పవలసినదిగా కోరుచున్నాను. గ్రామ గ్రామంలో, సభలు జరిపి, తీర్మానాలు, పత్రికలకూ, రాష్ట్ర, అఖిల భారత కాంగ్రెసు సంఘముల వారికి పంపవలయును.

చేగిరెడ్డి బాలిరెడ్డి.
కార్యదర్శి
కర్నూలు జిల్లా రైతు సంఘం.

★

## "ప్రజలు పాఠం నేర్పుతారు"

ఆశ్చర్యం. అల్లూరిపై రెండు సంవత్సరాల ఆంక్ష. ఇది రాష్ట్రకాంగ్రెస్ అధికారుల ప్రతాపమా?కార్యనిర్వాహకుల అంధత్వమా? వీరి ధైర్యమేమని? ఉద్దేశ్యమేమిటి? ముందేమి చేయాలని? పదవుల్లో పాతుకో గలమనియేనా? ప్రజలకేమి సమాధానం ఇస్తారు?

* * * *

ఇప్పటికైనా తమ తప్పిదాన్ని గుర్తించి అతివాదులపై ఈర్ష్యమాని ఆంక్ష రద్దుచేసికోవాలి. లేకపోతే విచారణలేని, ఈ శిక్షణా విధానాన్ని గుర్తించి ప్రజలే పాఠం నేర్పుతారు.

కలిదిండి బంగారం
కార్యదర్శి
నర్సాపురం తాలూకా
21—5—38 రైతుసంఘం.

## "అర్థంలేని అసమంజస కార్యం."

ఏలూరుతాలూకా రైతుసంఘ కార్య నిర్వాహక వర్గంవారు 20—5—38 తేదీన సమావేశమయి ఈ తీర్మానం గావించారు.

"గత సంవత్సరము పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెసు సంఘాధ్యక్ష కార్యదర్శులుగానుండి ఎట్టి అన్యాయములకు గాని అక్రమాలకుగాని తావులేకుండ అతి సమర్ధతతో సంఘ వ్యవహారముల నడిపి తమ జీవితములను స్వాతంత్ర పోరాటముల కొరకే వినియోగించుచున్న అల్లూరి గారపాటి సత్యనారాయణ గార్ల పైనను, కృష్ణాజిల్లాలో అతివాద సోదరులగు కానూరి బలరామయ్య కెట్టిపల్లి వెంకటరత్నంవగైరా గార్లపైనను, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గమువారు ఏవో అర్థం లేని అసమంజసమైన ఆరోపణలు ఆరోపించి బహిరంగ విచారణ సలుపకుండగనే తమ యిష్టమువచ్చినటుల రెండు సంవత్సరములవరకు కాంగ్రెసు సంఘములలో ఎన్నికసభ్యులుగా నుండరాదని నిర్ణయించుట అన్యాయమనియు, అక్రమ మనియు, స్వాతంత్ర పోరాటమును బలహీనపర్చుటకే త్రోవ తీయుచున్న ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గమువారి చర్యలకు ఈ సంఘమువారు తమ తీవ్ర అసమ్మతిని వెల్లడించుచూ వెంటనే వారిపైగల ఆంక్షను తొలగించవలసినదిగా రాష్ట్ర సంఘము వారిని కోరుచున్నారు."

# యువజనుల ఆగ్రహం

## " లజ్జాకరము "

క్రామేడ్ సత్యం చిన్నప్పటి నుంచీ స్వాతంత్ర్యోద్యమంలో పని చేస్తూ కాంగ్రెసు గౌరవ ప్రతిష్టలను పెంపొందించటానికి చేసిన త్యాగం, పడ్డ కష్టాలు తిన్న దెబ్బలు మనమింకా మరువలేదు. నాలుగు సంవత్సరాల నుంచీ బాధ్యత గల స్థానాలలో ఉండి కాంగ్రెసు యొక్క ప్రతిష్టను ఇనుమడింప చేయటానికి ఆతను పడుతున్న పాట్లు చూస్తూనే యున్నాము.

ఆంధ్రదేశంలోని అతివాద వుద్యమం యొక్క ప్రధాన పాత్రధారులలో అతడొకడని మన మంతా ఎరిగినదే. అటువంటి మన క్రామేడ్ సత్యాన్ని పట్టాభి, బ్రహ్మయ్య గార్లు తమ పెద్దరికానికి అడ్డు లేకుండా ఉండటం కోసం నియమాలను పాటించక కాంగ్రెసు యొక్క బాధ్యత గల స్థానముల నుండి వెడలగొట్టుట స్వాతంత్ర్య ప్రియులకు లజ్జాకరము. గత ఎన్నికలలో అతివాదులను అణచుటకు అనేకమైన అకృత్యాలకావించి మరల ఇపుడు నాప రూపాలు లేకుండా చేయటానికి ఉపయోగించిన మొట్ట మొదటి దెబ్బ యిది. అంతరమూ ఏకమై పెకరేషనును ప్రతిఘటించవలసిన యీ రోజులలో యునైటెడ్ ఫ్రంటు అవసరమని అతివాదులమైన మనం ప్రయత్నిస్తుంటే మ న ల ను ఏవిధంగా నైనా త్రోసి రాజనటానికి గిల్లి పోట్లాటలు తెస్తున్నారు. ఇప్పటి కప్పుడే మరికొంత మంది క్రామేడ్స్‌పై చర్య తీసికొన్నట్లు తెలియవచ్చుచున్నది. మనము ఉపేక్షించుచో రేపు జరిగేదికూడా మన కందరకూ తెలిసినదే. కాన తగిన పట్టుదలలో అతివాద యువకు లందరూ మేల్కొని ప్రజలకు పరిస్థితులను వివరించి చెప్పి తీవ్రమైన ఆందోళన కావించి ఆ చర్యల నుపసంహరించునట్లు చేయాలి. కాన జిల్లాలోని యువకు లందరూ బహిరంగ సభలలో అసమ్మతి తీర్మానాల కావించి భారత కాంగ్రెసు, రాష్ట్ర కాంగ్రెసు సంఘములకు పత్రికలకు తెలియ జేసి సక్రమమైన తీవ్రాందోళన కావించుట ప్రధాన కర్తవ్యమని జిల్లా యువకుల హెచ్చరించుచున్నాను.

ఇట్లు,
కొట్రగడ్డ రాజ గోపాల రావు
ప్రధాన కార్యదర్శి,
కృష్ణా జిల్లా యువజన సంఘం,
19—5—'38

★

"7—5—38 తేదీన మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలో విద్యార్థులందరూ కోడి నరసింహంగారి అధ్యక్షతను సమావేశమై ఈక్రింది తీర్మానము గావించిరి.

ఆంధ్రరాష్ట్ర యువజనసంఘ ప్రధాన కార్యదర్శియు, అఖిలభారత కాంగ్రెసు సంఘ సభ్యులును, యిప్పటి కెన్నియో సారులు సామ్రాజ్యవాదముతో ఢీకొని లాఠీలకు, జైళ్ళకు గురియై తనజీవితము నంతను స్వాతంత్ర్య పోరాటములోనే వినియోగించుచున్న సోదరులు శ్రీఅల్లూరి సత్యనారాయణగారి పైనను, యింకా ఇతర అతివాద సోదరులు, గారపాటి సత్యనారాయణ, కెట్టిపల్లి వెంకటరత్నం ప్రభృతులపైనను, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము వారుఏవోకొన్ని అర్థరహితమైన,అసమంజసమైన నిందారోపణలు చేసి డిసిప్లనరీ చర్య తీసుకొనుటను ఈ సభవారు తమ తీవ్ర అసమ్మతిని తెలియపర్చుచూ, అట్టి చర్యలు స్వాతంత్ర పోరాటమును బలహీనపర్చునని తలచుచూ వారిపైన ఈ శిక్షను వెంటనే తొలగింప వలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము వారిని కోరుచున్నారు."

వి. శివలింగప్రసాద్,
పల్లిసిటీ ఆఫీసరు,

# యునైటెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు

## కార్మికులలో ఐకమత్యం అత్యవసరం

కె. యల్. నరసింహం, బి. ఏ.

కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ అన్ని దేశాలలో కార్మికోద్యమములో ఐక్యత పెంపొందించుటకు తీవ్రమైన కృషి జేస్తున్నది. ఈ రోజున స్పెయిన్, ఫ్రాన్సు దేశములలో కార్మికులు ఒక కార్మిక సంస్థ నాయకత్వము క్రింద నడుస్తున్నారు. సోవియట్ ట్రేడు యూనియన్లు కూడా ఇంటర్ నేషనల్ ఫెడరేషన్ అఫ్ ట్రేడు యూనియన్సు (I. F. T. U.) తో కలసి ప్రపంచమంతటా ఫాసిస్టు దోపిడీ విధానమునకు ఎదురుగా పోరాటము సాగించి, శాంతి స్థాపనకై ప్రయత్నించుచున్నారు.

ఇంగ్లండులో లేబరు పార్టీనాయకులు ఐక్యతకు వ్యతిరేకమైనా కమ్యూనిస్టుల నాయకత్వం క్రింద కార్మికులు ఐక్యతకు అభిలషించుచున్నారు. పెట్టుబడీ విధానమును రూపుమాపుటకు, సామ్రాజ్యవాద నిరంకుశత్వమును నాశనముచేయుటకు ఫాసిజమును తల ఎత్తకుండా అణచి వేయుటకు, కార్మికోద్యమములో ఐక్యత (Unity) నినాదం అయింది. ఈ విధంగానే హిందూదేశములో కూడా కమ్యూనిస్టుల నాయకత్వం క్రింద కార్మికులు, పూర్తిరాజకీయ పరిజ్ఞానంతో, ఐక్యతా నినాదం ప్రారంభించారు.

1929 సంవత్సరములో నాగపూరులో జరిగిన ట్రేడుయూనియన్ కాంగ్రెసులో విభేదాలు వచ్చాయి. దాని ఫలితంగా కార్మిక సంస్థలు రెండు ఏర్పడ్డాయి. (1) ట్రేడుయూనియన్ కాంగ్రెసు. (2) నేషనల్ ఫెడరేషన్ అఫ్ ట్రేడుయూనియన్సు (N. F. T. U) కార్మికోద్యమమును గురించి, మితవాద కార్మిక నాయకులకుగల దృక్పథమే చీలికలకు కారణం. మితవాదులకు, అతివాదులకు సంఘర్షణ బయలుదేరింది. ఏ అంతర్జాతీయ సంస్థకు హిందూదేశ కార్మిక సంఘములను అనుబంధం జేయాలను విషయం, వైట్లీ కమీషన్ బహిష్కారము, జినీవాలో జరుగు అంతర్జాతీయ కార్మికమహాసభకు (I. L. O.) ప్రతినిధులను పంపుట, మొదలగు సమస్యలపై భేదాభిప్రాయములు వచ్చినాయి. మితవాద కార్మికనాయకులు, పెట్టుబడీ విధానము వుండగానే కార్మికుల హక్కులు సంపాదించగలమనుకొన్నారు. వర్గపోరాటమును ఒప్పుకొనేవారు కారు. ఈ భేదాభిప్రాయాలు రోజు రోజుకు పెరిగిపోయినాయి. ప్రతి పరిశ్రమలోను రెండు సంఘాలు ఏర్పడ్డాయి. రైల్వే పరిశ్రమలో కొన్ని సంఘములు ట్రేడుయూనియన్ కాంగ్రెసుకు అనుబంధం జేసారు. కొన్ని యింకొక సంస్థకుజేసారు. ఆరోజులలో మితవాదుల నాయకత్వంక్రింద గొప్ప, గొప్ప ట్రేడుయూనియన్లు వుండుటచేత ఎక్కువమందిని ట్రేడు యూనియన్ కాంగ్రెసునుండి తీసుకొని పోగలిగినారు.

ఈ చీలిక హిందూదేశములో కార్మికోద్యమమునకు గొప్పనష్టం గలుగజేసింది. అతివాద కార్మికనాయకులను బ్రిటిష్ గవర్నమెంటు అరెస్టుజేయుటం ప్రారంభించింది. కుట్రకేసులు పెట్టింది. కమ్యూనిస్టుల పై దుష్ట ప్రచారం సాగించింది. అతివాద కార్మికనాయకులు నడిపిన కార్మిక పోరాటములను తుపాకి గుండ్లతో అణచివేయ గలిగింది. ఉదా॥ జి. ఐ. పి. రైల్వే కార్మికుల సమ్మె, 30,000 మంది పాల్గొన్నారు. యస్. ఐ. ఆర్. రైల్వే కార్మికులసమ్మె. బొంబాయిలో బట్టల పనివారల సమ్మె; లక్షపైగా పాల్గొన్నారు. జనుపనార పనివారల సమ్మె. అనేక కార్మిక సంఘములను బ్రిటిష్ ప్రభుత్వము నిషేధించింది. మితవాద నాయకులు సమ్మెలకు తావివ్వకుండా మితవాద పద్ధతుల మీద కార్మికులను నడపించినా, యజమానులుగాని గవర్నమెంటుగాని లక్ష్యము జేయలేదు. మితవాద కార్మిక నాయకులకు పునాది రైల్వేమెన్సు ఫెడరేషన్ (All India Railwaymens Federation) రైల్వే కార్మికులను రాజకీయములనుండి దూరంజేసి రైల్వేబోర్డుతో చర్చలు ప్రారంభించారు. రైల్వే కార్మికులలోవున్న వుత్సాహంను అణచి వేసారు. ఈ మితవాద ధోరణి మూలముగా, రైల్వేబోర్డు జీతాలకోత అమలు జరిపారు. రిట్రెంచిమెంటు అమలు జరిపారు. క్రొత్తలీవు రూల్సు యిచ్చారు. అనేకమంది కార్మికనాయకులను పనిలోనుండి తొలగించారు. సమ్మెలు జేయకూడదన్న మితవాదులు కూడా సమ్మెలు జేయించాలిసి వచ్చింది. ఉదా॥ (1) యం. యస్. యం. రైల్వే కార్మికుల సమ్మె 1931 (2) యస్. యస్.ఆర్ రైల్వే కార్మికుల సమ్మె 1933 (3) బి. యన్. ఆర్ రైల్వేకార్మికుల సమ్మె 1935. కనీసము రైల్వేకార్మిక సంఘములను రికగ్నైజు అయినా చేయలేదు రైల్వేబోర్డు.

యన్. యం. జోషీ మొదలగు మితవాద నాయకులుకూడా తీవ్రంగా ఎదిరించినా గవర్నమెంటు పేమెంటు అఫ్ వేజెసు యాక్టుకు మోడీ సవరణను అంగీకరించింది. వైట్లీ కమీషను సూచనలు మంటగలిపారు. బి. శివరావు వంటి మితవాద కార్మిక నాయకులు జినీవాకు ఎదురుబాచిన లాభంలేదని గ్రహించగలిగినారు. రోజు రోజుకు ఎక్కువగుచున్న పెట్టుబడిదారి విధానమును ఎదుర్కొనుటకు కార్మికసంస్థలో చీలిక పోగొట్టుటకు ప్రయత్నాలు జరిగినాయి.

1938 సంవత్సరం ఏప్రియల్ 1 వ తేదీన నాగపూరులో జరిగిన కార్మిక మహాసభలో ప్రయత్నాలు ఫలించినాయి. యునైటెడు ట్రేడు యూనియన్ కాంగ్రెసు నాయకత్వం క్రింద నడుపుటకు నిశ్చయించారు. ఈ ఐక్యత అనేక షరతులతో కూడుకొని యున్నప్పటికి కార్మికుల పోరాటమును తీవ్రపరచుచున్నది. ఈ ఐక్యతపై కమిటీలవరకే జెందింది. ఫెడరేషన్(N.F.T.U.)ఒకసంవత్సరం వరకు కాంగ్రెసు (A. I. T. U. C) కు అనుబంధం చేయుటకు అంగీకరించారు. రాజకీయ సమ్మెలకు గాను సంయుక్త ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు (U. T U. C)లో 3/4 మెజారిటీతో ఆమోదం కావాలన్నారు: జండా విషయంలో ఎర్రజెండా మీద U. T. U. C అని అక్షరాలు వ్రాయాలని తీర్మానించారు. కమ్యూనిస్టులు కూడా కార్మికోద్యమములో ఐక్యత కోసము కొన్నింటిలో మితవాదులకు లొంగవలసి వచ్చింది.

ఈరోజున హిందూదేశములో అన్ని పరిశ్రమలలో పని జేయుచున్న కార్మికుల న్యాయమైన హక్కుల కొరకు, పోరాటమును సాగించు భారము సంయుక్త ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (U. T. U. C) మీద వుంది. 1929—30 లో తగ్గించిన కార్మికుల జీతాలు హెచ్చు జేయుట. కార్మికులకు నష్టదాయకమగు శాసనములను రద్దు జేయుట. (Bombay Labour bill, Trades dispute amendment bill etc.) సమ్మెజేయుటకు హక్కు పోకుండా కాపాడుట, రోజుకు 8 గంటల పని, కార్మికులకు వున్న అప్పులు రద్దు చేయుట, నిరుద్యోగ భీమాలు, యజమానులు నిర్బంధముగా కార్మిక సంఘములను గుర్తించుట, మొదలగు సమస్యలు ఎదుర్కొనుచున్నయి.

హిందూదేశ రాజకీయ పోరాటంలో కూడా కార్మికులు గొప్ప బాధ్యత నెరవేర్చవలసి యున్నది. మితవాద కార్మిక నాయకులు, కార్మికులు రాజకీయములో పాల్గొనకుండా పూర్తిగా ఆర్థికహక్కుల కొరకే పోరాటం సాగించాలంటారు. గిరి వంటి నాయకులు గాంధీ సేవ సంఘమువారిని అభినందించుతారు. రాజకీయ స్వాతంత్ర్యం కోసము కార్మికులు తమ రాజకీయ పార్టీలద్వారా జాతీయ ఐక్యత పెంపొందించుటకు ప్రయత్నించాలి. కాంగ్రెసులో సంఘప్రాతినిధ్యము ద్వారా కాంగ్రెసును జాతీయ ఐక్య సంఘంగా పెంపొందుటకు కృషి జేసి స్వాతంత్ర్య పోరాటమునకు నాయకత్వం వహించాలి.

కావున కమ్యూనిస్టులు, సోషలిస్టులు యీ పనులు జేయాలి.

(1) కార్మిక సంఘములు లేనిచోట్ల కార్మిక సంఘములను ఏర్పరచుటకు ప్రయత్నించుట వెంటనే సంయుక్త ట్రేడు యూనియన్ కాంగ్రెసుకు(U.T.U.C) అనుబంధం జేయాలి.

(2) కార్మికోద్యమములో కలిగిన ఐక్యతను ప్రతి కార్మికునకు జెప్పి, ఐక్యతపై కమిటీలకే గాకుండా రాష్ట్ర బ్రాంచిలకు వచ్చేటట్లు ప్రయత్నించాలి.

(3) నక్రమమైన కార్మిక శాసనములపై తీవ్రమైన ఆందోళన జేయాలి.

(4) ఫ్రాన్సు, స్పెయిన్ కార్మికోద్యమములో ఐక్యతను గుర్తించుకొని జాతీయ పోరాటమును బలపరచాలి.





# స్పైన్ లో ఆంగ్ల యువతి అనుభవాలు

## నాజీ జర్మనుల దౌష్ట్యం



ఫిలిస్ హిబ్బర్ట్ అనే 18సంవత్సరాల ఆంగ్ల యువతి ధైర్య సాహసాలతో స్పైన్‌లో వైద్యసహాయం కావించింది. ఆమె స్టార్ (ఇంగ్లండు) పత్రికా విలేఖరికి తన అనుభవాలను ఈ విధంగా తెల్పింది.

ఆమె ప్రభుత్వ సైనికుల అగ్రభాగంలోని దళం ఇటాలియనులను వెనక్కి తరిమినప్పుడు చూచింది. ప్రభుత్వ సైనికులు ఈమధ్యన వెనక్కి మరలినపుడూ చూచింది. యుద్ధంవల్ల ఆమె నరాలన్నీ దెబ్బతిన్నవి. ఇపుడు కొంత బాగుచేసుకోడానికి వచ్చింది. కాని విశ్రాంతి గైకొనదు. మళ్ళీవెళ్ళి సేవ చేయదలచుకొన్నది.

ప్రతిరాత్రి ఆమె సాంచ్ విచ్ (కెంటు) ఇంటిపైన ఆర్. ఎ. ఫ్., విమానాలు ఎగరటం వింటుండేది.

"నేను ఆ ఇంజన్ల రణగణధ్వని వినగానే నాకు స్పేనిష్ భూతాలను చూస్తున్నట్లుండేది" అని ఆమె చెప్పింది.

కొద్దిరోజుల క్రితమే ఆమె ఆలివ్ చెట్ల మధ్య పడిపోయింది కూడాను "మేము దీపంవెలిగించి రాత్రికి పడుకుందామని సిద్ధమయాం. ఇంతలో ఏ సూచనా లేకుండానే ఒక నల్లటి ఆకారం క్రిందికి వస్తున్నది. అది జర్మన్ బాంబర్ (విమానం). ఏమీ ధ్వనిలేకుండా నెమ్మదిగా దింపారు. ఈరోజుల్లో అలాగే విమానాలతో ఎదుర్కొంటున్నారు. విమానం నడిపేవాడు మా దీపం చూచాడు. క్రిందికి వచ్చి బాంబు విసరాడు. కొద్ది నిముషాల్లో మా క్యాంపు తునా తునక లయింది. నన్నొక ఆలివ్ చెట్టు క్రిందకి పారేశిందా విసురు. అంతా ప్రశాంతమయ మయేవరకు కదలలేక పోయాను భయంవల్ల.

ఈ విమానాలు "జెనికార్లో"కు వచ్చే టటువంటి హాస్పటల్ రైళ్ళ కోసరం వెదుకుతూ ఉంటాయి. ఈ రైళ్ళనిండా గాయపడిన సైనికు లుంటారు. ఒకసారి ఇలాగే మమ్ములను ఎదుర్కొన్నపుడు లారీ వెనకనుండి ఒక తుపాకి పేల్చి విమానాన్ని క్రింద పడగొట్టారు.

జర్మను యువకులను అరెస్టు చేసినపుడు పైరినెస్‌కు దక్షిణ భాగాన జర్మన్ విమాన డిపో ఒకటి కట్టుతున్నారని ప్రపంచంలో ఎవరూ తమ మాతృదేశాన్ని విమానబలంలో ప్రతిఘటించ లేరని దర్పంగా చెప్ప మొదలుపెట్టారు.

ఎపుడూ క్రిందకి పడగొట్టేది సామాన్యంగా జర్మను విమానాలే. ఎపుడూ ఆ విమానాలలో చూచేది జర్మను యువకులనే. జర్మనులంతా వచ్చిన ఫలితం అనుభవిస్తుంటే, ఇటాలియనులు సైన్యాలలో 'వెధవపను' అన్నీ చేస్తుంటారని వాళ్ళే చెప్పేవారు. దీనికి నిదర్శనము ఉంది. ఎపుడూ మా హాస్పెటల్‌కు చేరే వాళ్లు గాయపడ్డ ఇటాలియనులే కాని జర్మనులు గాదు

ఒకసారి ప్రభుత్వ సైన్యాలు ముందుకు పోతున్నాయి. ఫ్రాంకో సైన్యంలో కొందరు గాయపడ్డ సైనికులు వెనుకదిగబడ్డారు. వాళ్ళ వీపుల మీద ఫేసిస్టు కొరడాల ముద్ర లున్నాయి.

ఫ్రాంకో పక్షాన పోరాడే జర్మనులు హాస్పిటల్సును, ఆంబ్యులెన్సులను 'టార్గెట్' లగా ఉపయోగించుకొనుచున్నారు. అందుకనే మా 'రెడ్ క్రాస్' చిహ్నాన్ని ఉపయోగించ వద్దని ఆర్డరు. కారణం ఈ చిహ్నాన్ని చూడగానే బాంబులు వేయ మొదలు పెట్టారు.

మమ్ములను తెల్లటి దుస్తులను వేసికోనివ్వడం లేదు. పూర్వపు సైనికుల లాగులను చొక్కాలను మాత్రమే వేసుకొంటున్నాం.

ప్రభుత్వానికి సంరక్షించుకొనే ఆయుధ సామగ్రి చాల తక్కువ. అందుకనే విద్రోహులు భూమికి ఎంతో ఎత్తున గాకుండా దగ్గరలోనే బాంబులు వేస్తున్నారు. మెషిన్ గన్‌లలో ప్రజలను కాల్చుతున్నారు.

ఈ మధ్యనే ప్రభుత్వ సైనికులు జర్మను వైమానికులను పట్టుకొన్నారు. 5 అంగుళాల 'బులెట్సు' వారి వద్ద దొరికాయి. వాటి మీద 'జర్మనీ ముద్ర-1937 సంవత్సరం' ఉన్నాయి.

ప్రభుత్వ సైన్యాలు వెనక్కి పోతూ ఉన్నపుడు పెనల్ వద్ద ఒక హాస్పెటల్ పెట్టాం. అది ఉపయోగించకుండా ఉన్న రైల్వే టన్నెల్ వద్ద. నాల్గు రోజులు మాకు నిద్ర లేదు. ఆ ప్రదేశాన్ని వార్తయుగా విభజించడంతో, గాయపడిన స్త్రీ పురుషుల్ని, పిల్లల్ని చేర్చుకోవడంతో సరిపోయింది. ఒకసారి నేను నా స్వాధీనం తప్పిపోయాను, బిగ్గరగా ఏడ్వ సాగాను. నా చేతుల్లో గాయపడ్డ పసిపాప ఉంది. విమానంనుంచి ఆ బిడ్డ వీపున కాల్చారు. నేను పట్టరాని దుఃఖంతో దేవుణ్ణి ఇలా ప్రశ్నించాను. "ఇంగ్లాండులో, అమెరికాలోని స్త్రీలు ఇలాంటి ఘటనలు ఇక్కడ జరుగుతుంటే ఏమి చేస్తున్నారు?"

ఒక ప్రక్క రక్త ప్రవాహాలు, మందుగుండు సామాను, వైద్య సామగ్రి కనులకు గట్టుతుంటే ఇంకొక ప్రక్క నల్లటి పొగలో స్వస్తిక చిహ్నాలను వెదుక్కుంటూ గాలిలో వినోదించే వైమానికులు కనపడేవారు.

సంవత్సరం క్రితం ఇటలీ, జర్మనీ సైనికులు ఫ్రాంకో తరఫున పోట్లాడుతున్నారనే విషయం దాయడానికి ప్రయత్నించేవారు.

కాని నేడా భయం లేదు. స్పానిష్ విద్రోహులు కూడా కొంతమంది హిట్లర్ యూనిఫారముల తొడుగుతున్నారు.

స్పైన్‌లో ఫ్రాంకో జయించిన భూముల పైన జర్మనులు నివాసం ఏర్పరచుకొంటున్నారు."అని ఆమె తెల్పింది. కొంచెం స్వస్థత పొందగానే మళ్ళా స్పైన్ వెళ్ళడానికే ఆ యువతి నిర్ణయించుకొన్నది.

# డిసిప్లినరీ చర్యకు గొరపాటివారి సమాధానం

( 14 వ పేజీ తరువాయి )

గలదు. అట్లు ఎన్నడూనేను చెప్పియుండలేదు.

పెనుమంట్ర ఫిర్కా తాలూకు బ్యాలటు సంచులు నీళ్ళపగులగొట్టి అందుగల బ్యాలటు కాగితములన్నియూ కలిపివేసితినని మాత్రమే తమకు తెలిపి యుంటిని. మిగతా విషయములు చెప్పుచుండగనే తమకు ఆగ్రహంవచ్చుటయు, నేను చెప్పునది మీరు వినిపించుకొనక పోవుటయు, "డిసిప్లినరీ చర్య" తీసుకొందునని కేకలు వేయుటయూ జరిగినది. నా ఫిర్కా తాలూకు సంచుల కూడ పగుల యందు గాని, మా జిల్లా సంఘాధ్యక్షుల యందు గాని తప్పు లున్నాయని తమరు భావించిన యెడల మమ్ము వేరుగా రహస్యంగా మందలింపవలసి యుండ నలుగురిలోను అంత తీవ్రంగాను, నిరసనగాను మాట్లాడి అవమానించినారే యని మాకు చాల నొప్పి కలిగి అట నుండి వెళ్ళిపోతిమి. కోపముచే వివశులై యుండుటచే బ్యాలటు పేపర్లను కలిపివేసితినని చెప్పితే నాశనము (డెస్ట్రాయ్) చేసితినని తాము పొరపడి యున్నారని స్పష్ట మగుచున్నది.

మీ ఆజ్ఞను తృణీకరించాలను ఉద్దేశము నా కుండిన యెడల మొగలితురు గొట్టియే యుండెడి వాడను. నా కట్టి ఉద్దేశము లేనందువలననే వాటిని పగుల గొట్టక భద్రపర్చి యుంటిని.

సంగతి సందర్భము లిట్లుండ ఎన్నికోద్యోగి రాష్ట్ర సంఘము వారి ఆజ్ఞలను ఏమాత్రం లక్ష్యపెట్టక ప్రవర్తించాడనీ, పైగా బ్యాలటు కాగితములను నాశనం (Destroy)చేసినట్లుచెప్పనిదేచెప్పితినని వ్రాయుచూ, బ్యాలటు యొక్క రహస్యతను ఏమాత్రం గుర్తించ లేదనిన్నీ, ఎన్నిక రద్దు అయినప్పటికినీ బ్యాలటు కాగితములను సుస్థిరము చేయకుండా తన యిష్టము వచ్చినట్లు వాటిని నశింపు చేయుటలో ఎన్నికోద్యోగి యొక్క చర్య గర్హ్యనీయమనియు నేరారోపణ చేయుట విచారకరము.

ఎన్నికోద్యోగీయులకు నిశ్చితమైన విధానమును తెల్పు సరియైన సూచనలు (instructions)రాష్ట్రసంఘమువారియొద్దనుండిలేనప్పుడు, ఎన్నికపోటీలు సర్వత్ర తీవ్రముగా జరుగుటచే నేను నా ఎన్నికోద్యోగి ధర్మమును నిర్వహింప వలసినవాడనై యేవి ధర్మమని నమ్మితినో అట్లు నడచుకొంటిని.

ఇంత కంటె నేను వ్రాయవలసినదేమియూ లేదు. కాంగ్రెసు ఆజ్ఞలను సదా శిరసా వహించు నా బోటి వానిపై యిట్టి ఆరోపణలను చేయుట శోచనీయము.

ఏలూరు, 22-5-38 } ఇట్లు: గొరపాటి సత్యనారాయణ.

## మన రాజకీయాలు

[ 4 వ పేజీ తరువాయి ]

యం.యల్.ఏ లకు కూడ ఇలాంటి అవమానం చేయడం కాంగ్రెసు సంఘాలు చూస్తూ ఊరుకోరాదు.

★

గత శాసనోల్లంఘనోద్యమంలో ప్రభుత్వం లాగుకొన్న భూములు— పంచా భాయీ పటేల్ గారివి,తిరిగి ఇచ్చివేయాలని బొంబాయి ప్రభుత్వం ఆజ్ఞాపించింది.

### బీహారు

బీహార్ శాసన సభ ప్రతికూల పక్ష నాయకు డయిన సి. పి. యన్. సింహా గారు రాజీనామా నిచ్చారు.

★

బీహారు ప్రభుత్వం 40 మంది రాజకీయ ఖయిదీలను విడుదల గావించింది.

★

బీహారు రాజకీయ ఖయిదీ యగు జోగేంద్ర శుక్ల గా రీమధ్యనే విడుదల అయారు. ఆయనను బెంగాలు ప్రభుత్వం బెంగాలు రాష్ట్రం లో ఎక్కడా కాలు పెట్టరావని, నివసించరావని, కాపుర ముండరాదని నిషేధించింది.

### పంజాబ్

పంజాబ్‌లో 'లోకమిత్ర' అను పత్రికకు కాబూల్ సింగ్, యం.ఎల్.ఏ.గారు డిక్లరేషన్ అడిగారు.వెయ్యి రూపాయల ధరావతు అడిగింది.

### సింధు

సింధుష్ట్రంలోని నిరుద్యోగ యువకు లంతా జూన్ 3 వ తేదీన పెద్ద ఊరేగింపుతో అసెంబ్లీ భవనం వద్దకు వెళ్లి కోర్కెలను ప్రధాన మంత్రికి తెలియజేయడానికినిశ్చయించారు. జూన్ 4,5 వ తేదీలలో నిరుద్యోగుల సభ జరుప నిశ్చయించారు. కాని ఈ యాత్ర జరపరాదని కరాచీ పోలీసువారు నిషేధించారు. ఈ విషయంలో నిరుద్యోగ సంఘ ఆహ్వాన సంఘాధ్యక్షుడు ప్రభుత్వంతో సంప్రదించబోతున్నారు. అనుమతి ఈయకపోతే నిషేధాన్ని ఉల్లంఘించెదరని తెలుస్తూంది.

### మధ్యరాష్ట్రాలు

మధ్యరాష్ట్ర మంత్రులలో గల్గిన విభేదాలు తొలగిపోయినయి. రాజీనామా నిచ్చిన మంత్రులు ఉపసంహరించుకొన్నారు.

★

రాబోవు కాంగ్రెసుమహాసభ కోసల రాష్ట్రంలో త్రిపురి అనే గ్రామంలో జరపడానికి నిశ్చయించారు.

### ఆంధ్రరాష్ట్రం

గుంటూరుజిల్లాలో ప్రజలు విరివిగా ఉప్పు చేసుకొంటున్నారని, ఒడంబడికకు విరుద్ధమని, అది దౌర్జన్యమని మహాత్ముడొక ప్రకటన గావించాడు.

★

ఆంధ్రరాష్ట్ర విషయంలో ఇంగ్లండుకు రాయబారం వెళ్లడం అనవసరం, ప్రమాదకరం అంటూ సుభాసుబాబు తన అభిప్రాయాన్ని ప్రకటించాడు.

★

జూన్ 8 మొదలు 15 వ తేదీవరకు రాయలసీమ కరువు వారముగా పరిగణించ సహాయం చేయవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ అధ్యక్ష కార్యదర్శులు విజ్ఞప్తిగావించుచున్నారు.

## రైతు లోకం

[ 3 వ పేజీ తరువాయి ]

4–5–38 వ తేదీన భీమవరం తాలూకా మెంటేపూడి రైతుసంఘ సాధారణ సమావేశం జరిగింది. కొల్లా దొరయ్యగారిని అధ్యక్షులుగాను, బోడపాటి నరసింహారావుగారిని కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

★

**దివి తాలూకా రైతులు.**

దివితాలూకా రైతుసంఘంవారు చల్లపల్లిఎస్టేటు రైతుల కష్టాలనుగురించి తెలియజేయుటకు అవకాశము కోరగా రాజాగారీయలేదు. ఉపసంఘము వారు వ్రాసిన జాబుకు లిఖితపూర్వకమైన జవాబు రాలేదు. అందుచే స్థాయిసంఘం పెదననగల్లులో సమావేశమై నోటీసు ఇచ్చిరి. నోటీ సిచ్చిన తర్వాత రైతులు తమ కోర్కెల మెమొరాండం పంపవలసినదని, సంఘానికి జవాబిచ్చుటకు రాజాగారు తేదీని నిర్ణయించెదరని మేనేజరుగారొక జవాబు వ్రాశారు. ఈ క్రింది మెమొరాండం పంపారు.

**మెమొరాండం.**

(1) దేవరకోట ఎస్టేటుకో రికార్డు అవ్ రైట్సుతయారు చేయించాలి (2) కృష్ణలోని ఇసుక ఊరికే తెచ్చుకో నియ్యాలి.(3)ధర్మచెరువులు, వనములు, రుద్రభూములు వగైరా ప్రజానమిష్టికి వదలివేయాలి (4) ఎప్పటికప్పుడు పట్టా ట్రాన్సుఫరుతో రైతు భూమి ప్రమాణము, శిస్తు, తరము రేటు వగైరా పట్టాలు ప్రతి సంవత్సరం ఈయాలి. (5) నదులలో మున్గిన లంకలకు రిమీషన్ ఇస్తూ, లంక తేలిన వెనుక మామూలు పన్ను వసూలు చేయవలెను. (6) మురుగు సౌకర్యాలు వెంటనే ముఖ్యంగా లంకలలో చేయించాలి. (7) భూములలో ఉండే చెట్లకు ప్రత్యేక శిస్తును ఇచ్చువిధానం రద్దు పరచి పట్టాలిప్పించవలెను. (8) కౌలీ భూములలో ఇండ్లు, పశువుల సావిళ్ళు వేసుకొన్నా. "సాగునాలాయిక్"అయినా శిస్తు వసూలు చేయరాదు.(9)ప్రతి సంవత్సరం ఏప్రిల్, మేనెలలో బోదెలు, కాల్వలు మరమ్మతు చేయించవలెను. లేదా దీనికిని వసూలు చేయమానవలెను. (10)అమరకం చేసే రైతులపైన తాబేదార్లు చేసే దౌర్జన్యం మాన్పించాలి. (11) గయ్యాళి భూములలో రైతులు పెంచుకొన్న చెట్లకు ఎస్టేటువారి అభ్యంతరం ఉంచరాదు. (12) లంచగొండితనం మాన్పాలి. (13) పెదకళ్ళేపల్లి వగైరా గ్రామములలో మామూలు పల్లముపై రైతులకున్న హక్కుల భంగపరచరాదు.(14) ఎస్టేటు స్వాధీనంలోని భూములు లంకలు పెద్దకళ్లేపల్లి వగైరాలోని భూములు ఆయాస్థానిక బీదరైతులకు శిస్తుకు ఈయాలి. (15) ఇప్పటికి నిల్వవున్న అపసవ్య శిస్తుల దావాలు ఉపసంహరించుకోవాలి. (16) ఎస్టేటు భూములకున్న హెచ్చు శిస్తు రేటు యకరానికి రు2-8-0 చొప్పున తగ్గించాలి.

★

ఏలూరు తాలూకారైతుసంఘ కార్యనిర్వాహకవర్గమువారు 20—5—38 తేదీ సాయంత్రం గ 5–30 లకు జిల్లా రైతుసంఘ కార్యాలయమున శ్రీయుత వంకినేని రాజగోపాల వెంకటరత్నంగారి అధ్యక్షతను సమావేశమై తాలూకాలో ప్రతిగ్రామమందును రైతుసంఘములు నేర్పాటుచేయుటకును. గ్రామాలలో గల రైతు కష్టములను తెలుసుకొని రిపోర్టు చేయుటకును, సంచారము జూను మొదటి వారమునుండి ప్రారంభించుటకు ఒక కమిటీని నియమించుచూ సంఘావసరముల కొరకు ప్రచారము నిమిత్తం ధనమును వసూలుచేయుటకును, ఏలూరులో గల జిల్లా రిజస్ట్రార్ ఆఫీసును ఎత్తివేయుట రైతులకు వ్యయప్రయాసలు గనుక ప్రస్తుత మున్నటుల రెండుజిల్లాలకు మధ్యాభాగమును ఏలూరులోనే వుంచుట న్యాయముగాన మార్చవలదని మద్రాసు రివెన్యూమంత్రిగారిని కోరుచునూ, ఏలూరు మున్సిపలు ఏరియాలో గల బండ్లదొడ్డిలయందు పశువులకు నీటి కుండులను, నీడకు చెట్లను పెంచుటయు చేయించుమని ఏలూరు మున్సిపలువారిని కోరుచూ నొక తీర్మానము గావించిరి.

★

**రాయలసీమ రైతుసభ**

మే 24 వ తేదీన రాయలసీమ రైతుమహాసభ పంగనూరులో జరిగింది.రంగాగారధ్యక్షత వహించారు. రాయలసీమ రైతులను కరవునుండి రక్షించాలంటే, తుంగభద్ర ప్రాజెక్టు నిర్మించాలనీ, వ్యవసాయపు అప్పుల పంచాయతుల వశంచేయాలనీ, కుముద్వతీ పెన్నప్రాజెక్టు నిర్మించాలనీ కోరారు.

★

ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతుసబ్ కమిటీ వారి మెమొరాండం తయారైనది. జూన్ 3 వ తేదీన జరుగబోవు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక సభలో చర్చకు వస్తుంది.

★

అనంతపురం జిల్లా, కంబాదూర్, కుందుర్పి ఫిర్కా రైతులు, నారాయణపురం, బెస్తనపల్లి గ్రామాలమధ్యనున్న పంటచెరువుల నీటికొరకు హగరా కాలువ నుండి ఒక ఛానల్ త్రవ్వించ వలసినదని కోరారు రైతులు. ప్రభుత్వంవారీ ప్రాంతాన్ని పరిశీలించి ఇపుడు త్రవ్వడం అసంభవమని ప్రకటించారు.

## సభలు – నోటీసులు

**దివి తాలూకా రైతుసభలు.**

4–6–38 న పెదకళ్ళేపల్లిలో యీస్టుబ్యాంక్ కెనాల్ రైతుమహాజనసభ జరుగుతుంది. జొన్నలగడ్డ రామలింగయ్యగారు ప్రారంభించెదరు. చెలసాని వాసుదేవరావుగారధ్యక్షత వహించెదరు. శెట్టిపల్లి వెంకటరత్నంగారు పతాకోత్సవం జరిపెదరు.

★

తాలూకా చతుర్థ రైతుమహాసభ కూడ పై దినమున అచటనే జరుగును. పిడికిటి రామకోటయ్యగారధ్యక్షత వహించెదరు. తెన్నేటి విశ్వనాథంగారు ప్రారంభించెదరు.

★

**తూ॥గో॥ జిల్లా రైతు సంఘం.**

3–6–38 తేదీ శుక్రవారం మధ్యాహ్నం గం॥ 1–0 లకు ఈదిగువ విషయములను చర్చించుటకు, రాజమండ్రి సంఘఆఫీసునందు పైసంఘ కార్యనిర్వాహకవర్గము కూడునుగాన తాము తప్పక వచ్చేయ ప్రార్థితులు.

పెన్మెత్స సూర్యనారాయణ
ప్రధాన కార్యదర్శి

★

**గుడివాడతాలూకా రైతుసంఘ సమావేశం.**

ది 4–6–38 తేదీన పగలు 3 గం గుడివాడలోని తాలూకా రైతుసంఘ కార్యాలయములో గుడివాడ తాలూకా రైతుసంఘ కార్యనిర్వాహకవర్గపు సమావేశము జరుగుగాన సభ్యులెల్లరు తప్పక రాగోరెదను.

ఇట్లు,
ప్రధాన కార్యదర్శి
చాగర్లమూడి బ్రహ్మానందరావు.

ఒంగోలు తాలూకా రాజకీయ మహా సభ జూన్ నెలలో రావర్లలో జరుగు తుంది. రావర్లచుట్టు 20 వేల పల్లభూమి ఉంది. కొమ్మమూరు కాలువనుండి నీటి పారుదల విషయమై రైతులు, కూలీలు ప్రయత్నించుచున్నారు. అందుచే ఇక్కడ రాజకీయసభ జరిగిన ప్రాముఖ్యత ఉండును. జూన్ 5వ తేదీనుండి తాలూకా కాంగ్రెస్ ఆఫీసు రావర్లలో ఉంటుంది.

ఇట్లు
మెట్లు జయరాం నాయుడు.
ప్రధానకార్యదర్శి,
రావర్ల. అమ్మనబ్రోలుపోష్టు,
గుంటూరుజిల్లా

★

జూన్ 4 వ తేదీన మదనపల్లెలో రాయలసీమ యువజనసభ జరుగుతుంది. రంగాగారు ప్రారంభకులు. సంజీవరెడ్డి గారధ్యక్షులు.

మదనపల్లె 23—5—28 } డి. యస్. వల్లభరావు

★

7—6—38 మంగళవారం పుదయం 11 గంటలకు శ్రీ వల్లూరు పల్లి వెంకట రత్నంగారి గృహమునందు గుడివాడలో కృష్ణాజిల్లా మహిళాసంఘ కార్యనిర్వాహక వర్గము సమావేశమగును గాన సభ్యురాండ్రందరూ తప్పక దయచేయ వలెను.

గుడివాడ 26-5-28 } అధ్యక్షురాలు వ॥సీతామహాలక్ష్మమ్మ

## మరికొన్ని అసమ్మతులు

అల్లూరి ప్రభృతులపై తీసుకొన్న డిసిప్లిన్ చర్యను నిరసించుచూ ఈ క్రింది సంఘాలు తీర్మానించినవి.

(1) గండి గుంట యువజనసంఘం
(2) నిడదవోలు యువజనసంఘం.
(3) ఉన్నూరు మహిళాసంఘం.
(4) గుంటూరు జిల్లా వ్యవసాయ కూలీ సంఘ కార్యనిర్వాహక వర్గం.
(5) ఆకునూరు యువజనసంఘం.
(6) గండిగుంట గ్రామకాంగ్రెసు సంఘం.
(7) వుండేశ్వరపురం గ్రామకాంగ్రెసు సంఘం
(8) భీమవరం తాలూకా కాంగ్రెసు సంఘం
(9) చెరుకుమల్లి గ్రామ కాంగ్రెస్ సంఘం

















## ప్రకటన

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు పోస్టు మాస్టరు శ్రీ చిల్లర సత్యనారాయణగారి జీవిత భీమాతాలూకు నెం. 93518 రు గల పాలసీ పోయినదని మాకు నోటీసు చేరినది. అవిషయమై నేటినుండి ఒక నెల దినములలోగా ఏవిధమైన ఆక్షేపం తరములను మాఆఫీసుకు చేరకుండ నున్న యెడల, సదరు పాలసీకి డూప్లికేటు నిచ్చెదమని యిందు మూలముగా ప్రకటించుచున్నాము.

రాజమండ్రి 21-5-38 } పి. డి. ఖోస్లా. జనరల్ మేనేజర్
భారత ఇన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్
లాహోర్

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యామృతం

## గొప్ప జ్యోతిష్కులు

మహారాజులు, గొప్పగొప్ప వారినుండి బంగారు పతకములు, యోగ్యతాపత్రములు పొందిన పండితులు. జాతక చక్రానికి రు 2 లు. జీవిత ఫలితానికి రు 5 లు. సంవత్సరఫలితానికి నెలలవారీగా రు 5 లు వారం వారవివరాలతో రు 10 లు. భవిష్యత్తునుగురించిమూడు ప్రశ్నలకు రు 1-0-0 ప్రతిఅదనపు ప్రశ్న ఒకటికి 0-8-0.
(జాతకచక్రంజన్మతేదీ వ్రాసేపంపాలి)
వివరాలకు: యం. శ్రీనివాసాచారియర్
పండిట్ కాలియార్
68 లజ్, మైలాపూర్, మద్రాస్
అని వ్రాయండి

## క్రొత్త పుస్తకములు

సచిత్రములు.

1. సుభాషచంద్రబోసు
చరిత్ర, ఉపన్యాసములు
112పుటలు వెల 0-6-0

2. జవహర్లాలు వ్యాసములు
(22 ఉపన్యాసములు, వ్యాసములు)
180 పుటలు గ్లేజుప్రతివెల 0-8-0
సాదాప్రతి 0-6-0

3. మహాత్మాచరిత్రము
మోతీలాల్ నెహ్రూ జీవితకథ
184 పుటలు వెల 0-8-0

తాతా చరిత్రము
(మహాదేశభక్తుని జీవితము) 0-8-0

5. జలియన్వాలా
ప్రపంచ చరిత్ర 2-8-0

కొ. శఠకోపాచార్యులు,
కాకినాడ

తెలుగులో సోషలిస్టు గ్రంథాల్ని ప్రకటించే గ్రంథమాల ఇదే.

ఇప్పుడే వెలువడ్డాయి.

లెనిన్ ఉపదేశాలు. వెల 6 అణాలు
(పామీదత్తు రచన కనువాదం.)
పారిస్ కమ్యూన్. వెల 6 అణాలు
(లెనిన్ రచన కనువాదము)

ముచ్చటైన బైండుతో. ఫొటోలతో. చక్కని భాషలో. నూరుపుటలకు పైబడిన గ్రంథాలేయివి చెందూహుడా. వెంటనే వ్రాయండి. ఆలసిస్తే. ఏమో....

త్వరలో వెలువడుతూన్న గ్రంథాలు.
'నాడు-నేడు.' అడయంకో.
'నేనుమన్నేరు.' షోలోకోవ్.
'ఇండియన్ మ్యూటినీ 1857.
'అక్టోబరు విప్లవం' లెనిన్.

మీకేమైనా రాజకీయ గ్రంథాలు కావాలా? అయితే.

వెంటనే మాకు వ్రాయండి.

మహీధర కృష్ణమోహన్
విశ్వసాహిత్యమాల.
ముంగండ.
(via) అంబాజీపేట, తూ. గోదావరి.

## జాకబ్సు పెయిన్‌కిల్లర్

అనుపానవిశేషములతో అన్నినొప్పులను అంతరింపచేయును. అజీర్తి, అరకవిరోచనములు, ప్లేగు, మలబద్ధము, గజ్జపవిళ్ళలు, కాళ్ళ తిమ్మిర్లు, తామర మొదలగు చర్మవ్యాధులు, తేలు మొదలగు విషములును, నిష్కపటముగా నిర్మూలించును.

బుడ్డి రు 1-0-0 డజను రు 9-0-0

డాక్టరు. యల్. టి. జాకబ్
డెంటిస్టు రాజమండ్రి.

## యువకుడా!

నీవు కంటకావృతమైన రాజకీయాల్లో ప్రవేశించినప్పుడు. అమ్మ అభ్యంతరాలు చెబుతుంది; ఇల్లాలు కన్నీరు పెడుతుంది.

తల్లి ఆటంకాలు, గృహిణి నిరుత్సాహం లేకుండా, వారు ప్రేమతో నీకు ఉద్యమంలో సాయపడాలంటే ఒక్కసారి అమ్మ పుస్తకాన్ని చదివించు.

**అమ్మ** విశ్వవిఖ్యాత గ్రంథకర్త మాక్సిమ్ గోర్కీగారి 'మదర్'కు అనువాదం.

ఆదర్శ గ్రంథమండలివారి ప్రచురణ. వెల రు 1-8-0.

పుస్తకాలకు—

సంమూరి ప్రసాదరావు,
రాష్ట్ర రైతుసంఘం.
గవర్నరుపేట, బెజవాడ.

## లక్ష్మీప్రావిడెంటు ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్ మచిలీపట్టణము.

మా పట్టాదారులకు, ఏజంట్లకు ఆకర్షణీయమగు
కొన్ని ప్రత్యేక సదుపాయములు.

1. రు50 లు మొదలు, రు 500 లు, వరకు భీమా చేయుటకు వీలగునట్లు. ప్రావిడెంటు ఇన్సూరెన్సు ప్రణాళికలు గలవు.
2. వైద్యపరీక్షలేకను, లేకుండగను, భీమాచేయుట కవకాశము లేర్పడుపబడినవి.
3. కార్మికులకు, కర్షకులకు, పిల్లలకు, పెద్దలకు, ఉద్యోగులకు, గొప్పవారికి వీలగునట్లు పర్మనెంటు ఫండు డిపాజిట్లు గలవు.
4. పాలసీదారులు, ఏజంట్లు, పరిపాలనలో పాల్గొనుటకుగాను రెండు స్థానములు ప్రత్యేకింపబడినవి.
5. ఏజంట్లకు వంశపారంపర్య కమీషన్ పద్ధతులుగలవు.
6. కంపెనీ వ్యాపారము మితవ్యయముతో నిర్వహింపబడును, తెలుగులో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడును.

కమీషను పద్ధతి మీదగాని, జీతముమీదగాని పనిచేయుటకు అన్నిప్రాంతములకు ఏజంట్లు ఆర్గనైజర్లు కావలెను.

వివరములకు—మేనేజింగు డైరెక్టరు పేర కంపెనీకి వ్రాయుడు.

VETO
FOR CUTS BURNS SPRAINS

## మీరు ఏల బాధపడెదరు?

మూలవ్యాధి కన్న భరింపరాని బాధ మరి యొకటి లేదు. మీరు ఆ వ్యాధితో బాధపడుచున్నయెడల వీటో వాడి వెంటనే స్వస్థత జెందుడు. వీటో కొద్ది నిమిషాలలోనే బాధ తగ్గించును. ఎట్టి మొండి వ్యాధినైన ఆపరేషను లేకుండగనే నిర్మూలము చేయును. అనేక డాక్టర్లచే మెప్పును పొందినది. ఒక అణా బిళ్ల పంపువారికి శాంపిల్ ఉచితముగా పంపబడును.

వీటో ప్రతిచోట దొరకును.

వీటో మాన్యుఫేక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.

Printed by V. Suryanarayana Sastry at Srinivasa Press and edited and Published by M. [illegible] } Rajahmundry.

